మృగధరజయవదనాశివసతి । నిగమజలధిసదనా। మదవతి । మృగధరధర విధిమురహరశుభకరి । మృగపతివాహనిమునిజనగణసుఖకరి ॥గౌరీశ్రీకాళీ శివమానససారససుమరాళీ ॥౫॥

ధన్యాసిరాగం-ఆదితాళం.

దిశమమశుభతతిమయిభగవతిశశి । దినకరశుచినయనే । పశుపతి నిజసతిహితమతిమదవతి । పరమపదనిరుపమజలధిశయనే ॥దిశ॥ ౧ ॥ పటుతరసురుచిరిపరిమళమృగమద । ప్రవిమలనిటలతలే। స్ఫుటతరకటితటఘటితకలితహిత।శుభకరలసదరుణవసనవిమలే॥దిశ॥ ౨॥ సురవరముఖబుధని చయసన్నుతఘన । సుఖకరసురకుటజే । హరిహరపరినుతవిలసదరుణమృదు । పేశలయశుభచరణసరసిజే ॥దిశ॥ ౩ ॥సకలభువనజననవిలయకర గుణా । సమునయసువిలసితే । ప్రకటబలమదయుతనిశిచరనికర । వికట చటులగహనదహనవితతే ॥దిశ॥ ౪ ॥ వేంకటనరహరిగురువరసుహృదయ । విమలకమలనిలయే । శంకరమధురిపువిధిబలరిప్రముఖ । సకలవిబుధ గణసుఖవనవలయే ॥దిశ॥౫॥ వెంకురామకవికులకలశజలధి । శశధరవర బింబే।పంచబాణసంజీవనకరి।శ్రీ।పకృతిపురుషమయగుణనికురుంబే ॥దిశ॥౬॥

నారాయణీరాగము-అటతాళము.

శ్రీమంతుని జేయవే। నారాయణిశ్రీమంతుని జేయవే ।।శ్రీమహాత్రిపురేశ్వరి । శ్రీనివాససహోదరి । కామసంజీవనకరీనను । కరుణతోడను బ్రోచుచు నను శ్రీమ॥ ౧ ॥సోమరవిశుచిలోచనాసూరిజనభవమోచనా। సామరస్యపరాయణీనా । సకలపాతకములనుబాపి ॥శ్రీమ॥ ౨ ॥ వామదేవశుభంకరి । వాసవాదిసుఖంకరీ । కామతంత్రవిలాసినీవిజ్ఞానపదమునవని ల్పనన్ను ॥శ్రీమ॥ ౩ ॥ కామకోటియంత్రరూపిణికాంచనాంబరధారిణీ। కామతంత్రవిహారిణిమణికనకకుండలధారిణీనను ॥శ్రీమ॥ ౪ ॥సోమమండలవాసినీ । శుంభదైత్యవినాశని । భీమవిక్రమశాలినీనను । ప్రేమతోమన్నించిసతతము ॥శ్రీమ॥ ౫ ॥

ఆరభిరాగము-ఆదితాళము.

కామతంత్రేశ్వరీకాళీమహాదేవీ । కామారిహృత్కాసారమరాళీ॥ ౧ ॥ విలయిూకృతభువనపాళీ । మహాదేవీ । విలశితచికురనిందితాళీ ॥౨॥ సకలకళ్యాణగుణమాతంగీ । మహాదేవీసకలభువనమోహనాంగీ ॥౩॥హిమశైలవరకుమారిగౌరీమహాదేవీ।హ్రీంకారపంజరవిహారీ ॥౪॥స్మరరథాం

గవిజయదివ్యశ్రోణీమహాదేవీ । పురుహూతనీలమణివేణీ ॥ ౫ ॥ యోగని
ద్రాదేవిసత్యవాణీమహాదేవీ । నాగాస్త్రసమ్మోహనాస్త్రపాణీ ॥౬॥ క
రుణారసగంభీరకటాక్షీ । మహాదేవీ । నిరతిశయసుందరీమీనాక్షీ ॥౭॥ స
త్యలోకజనకల్పవల్లీమహాదేవి । నిత్యపరమానందవల్లి ॥౮॥ లోకజననస్థి
తివిలయలీలామహాదేవీ । శ్రీకరకస్తూరీతిలకఫాలా ॥౯॥ వేంకటగురురూప
ధారిణీ । మహాదేవీ । శంకరానందగుణశ్రేణీ ॥౧౦॥ నన్నుబ్రోవవమ్మలో
కజననీమహాదేవి । నిన్ననమ్మితినిపాపశమనీ ॥౧౧॥ చెంచురామకవీంద్ర
పోషిణీ । మహాదేవీ । పంచభూతేశ్వరీశ్రీరమణీ ॥౧౨॥

అసావేరి రాగము-ఆదితాళము.

తల్లిదండ్రిగురుదైవమునీవని । దలచియుంటినిశాంభవీ । పల్లవపా
ణినీపాదారవిందములు । నుల్లములోపలనుంచిధ్యానముజేశి ॥తల్లి॥౧॥ స
కలైశ్వర్యములొసగే । సాధ్వీమణివనుచు । అకలంకముగవేడితి। మకరాం
కజననీమనసుననామెందు । వికటముదోచెనావేదాంతవేదిని ॥తల్లి॥ ౨॥
పుడమిలోసిరితిబుట్టించినన్నిపుడు । జడునిజేయగనేలనే । కదురమ్యమైన
ట్టి । కరుణానామెందుంచి । యెడతెగనిసంపదలిచ్చిరక్షించవే ॥ తల్లి॥౩ ॥
కామాంకుశనినన్ను గాశిజెందించకుకామేశ్వరిభగవతి । యేమానవులనేను
యాచించజాలను । కామాక్షినాకునీకన్నదిక్కెవ్వరు ॥తల్లి॥౪॥పంచాగ్ని
వేంకటపరమగురురూపిణి । పంచకోశసాక్షిణి । చంచలాక్షీశ్రీవశంకరీ
యీశ్వరీ । చెంచురామదాససంతోషిణీదేవీ ॥తల్లి॥౫॥

శ్రీరాగం ఆదితాళం.

నీరజభవముఖశుభఫలదే । భగవతికురుముదమయి ॥నీరజ॥ శ్రీర
జితశిఖరినిజపదనే । చిత్ప్రకాశకోషాకరవదనే ॥నీరజ॥ ఇంద్రనీలమణిచికు
రాన్వితముఖబింబే । ఇందుసూర్యతాటంకవిడంబే । చంద్రవాళీనుతగుణ
నికురుంబే । సమరహరణదనుజేంద్రకదంబే ॥నీరజ॥ ౧ ॥నిగమనిచయకాం
తారవిహారమయూరీ । నిత్యభక్తహృదయాంబుజభ్రమరీ । అగణితసుంద
రప్రకృతివికారి । అఖిలకలుషసందోహవిదారి ॥నీరజ॥ ౨ ॥ కటినటఘటి
తవిరాజితశోణదుకూలే । కామతంత్రసామ్రాజ్యవిశాలేచటులనయనసర
సీరుహలీలే । సామవేదపారాయణశీలే ॥నీరజ॥ ౩ ॥ పంచవహ్నివేంకట
సద్గురుగాత్రే । పంచబాణనుతవిమలచరిత్రేచెంచురామకవివంశపవిత్రే
సకలలోకసంసారసుసూత్రే ॥ నీరజ ॥౪॥

శహనారాగము-ఆదితాళము.

తల్లి చిన్మయానందవల్లిసుగుణపాల । వెల్లికృపారసముజల్లినన్ను రక్షించు ॥తల్లి॥ సంగీతభావనాంతరంగీసర్వేశ్వరీమా । తంగీవీణారవాసుసంగీశ్రీసుందరాంగి ॥ తల్లి॥ ౨ ॥ మనమునన్నినున్ననుదినముస్మరియించినాను । ఘనమైనవరములిచ్చిధనమువృద్ధిజేయుము ॥తల్లి॥ ౩ ॥ మాయామోహినీమహామాయాబీజరూపిణీ । యేయపరాధములుజేయలేదమ్మనీకు ॥తల్లి॥ ౪ ॥కామతంత్రసూధాబ్ధిసోమప్రకాశినీశ్రీ । కామితార్థప్రదానకమనీయగుణనిధి ॥తల్లి॥ ౫ ॥ అజ్ఞానప్రశమనిప్రజ్ఞానరూపిణీ ।యజ్ఞపరాయణీనీ । యాజ్ఞమఱరగలేమ ॥తల్లి॥ ౬ ॥ పంచాగ్నివేంకటపరమగురురూపిణీప్రపంచసాక్షిణీదేవి। చెంచురామునిగన్న ॥తల్లిచిన్మయానందవల్లి॥౭॥

పున్నాగరాగము-అటతాళము.

పున్నాగజయగమనా । నారాయణీ । పున్నాగజయగమనా॥పున్నాగచమ్పకపుష్పసహితవేణీ। పన్నగభూషణప్రాణేశ్వరిగౌరి॥పున్నాగ॥ ౧ ॥ బ్రహ్మరాక్షసమథని బ్రహ్మాస్త్రరూపిణీ।బ్రహ్మరుద్రేంద్రాదిపరమార్థదాయినీ ॥పున్నాగ॥ ౨ ॥ పంచాగ్నివేంకట। పరమగురురూపిణీ। చెంచురామకవినిశిక్షునిజేయవే ॥పున్నాగజయగమనా ॥౩॥

యిందుస్థానికమాజురాగం-రూపకతాళం.

ప్రాణేశ్వరిశ్రీరమేసౌభాగ్యవరందేహిమే। వీణాపాణినీలవేణివీరేశ్వరిశార్వాణి ॥ప్రా॥ ౧ ॥ శిందూరద్యుతిలహరిగౌరి । శ్రీనారాయణసోదరి । బృందారకబృందానందే । భువనైకమూలకందే॥౨॥సాంద్రకృపాహృదయే । కామేశ్వరవామాంకనిలయే । ఇంద్రాదిలోకనిస్తంద్రేపరచితరవిచంద్రే ॥ ప్రా॥ ౩ ॥ గతిధీకృతపున్నాగే । మహాకాలకంధరసంయోగే । శృతిస్మృతిసుస్రతసౌఖ్యతతి । సౌభాగ్యవతిభారతీ ॥ప్రా॥౪॥ వేంకటగురురూపిణీ । వేదవేదాంగపరాయణి । శంఖచక్రాంకితపాణి । చెంచురామపోషిణి ॥ప్రాణేశ్వరి శ్రీరమేసౌభాగ్యవరందేహిమే ॥౫॥

ఈశమనోహరిరాగము-రూపకతాళము.

ఈశమనోహరిగౌరి । నీశాశ్వతపదభక్తిము । నేమగోరితినిరమణీ ॥ఈ॥అరుణారుణమృదుచరణా । సురపాలనఘనకరుణా । పరమేశ్వరినారాయణీ । పాపకర్మగణశమనీ॥ఈ॥ ౧॥శుహినాచలవరతనయా । మహితామణీకృతవినయామహిషాసురకులనాశనీ । మందమధురమృదువా

ణీ॥ ఈ॥ ౨॥శివదూతీసుభగవతీ। నవయోగినీకృతజగతీ। భవరోగగణవి దారిణి। పద్మగర్భముఖజననీ॥ఈ॥ ౩ ॥ పంచాననజయగమనా।పంచీకృతజగదవనా। పంచాగ్నులకుల వేంకటబ్రహ్మపదముగలరమణీ॥ఈ॥౪॥ రామాకుళనిధిసోమారమణీయసుగుణధామా। కామాన్వితుడగుచెంచురామకవినిమన్నించవే ॥ ఈశమనోహరిగౌరి ॥౫॥

మారువరాగము-అటతాళము.

తల్లీపరదేవీసకలసన్మునికల్పవల్లిననుబ్రోవవే।పల్లవపాణీనీపాదారవిందములు। యెల్లకాలముపూజయొనరించుచున్నాను ॥ తల్లి ॥బాలాకరుణాకటాక్షదృష్టినిజూడులోలలోచనీశాంకరీ।ఫాలలోచనునిప్రాణనాయకివని। నీలీలాచరితమునేభజించెదనమ్మ॥ తల్లి॥ ౨ ॥గౌరీశరజన్మజననిప్రతిభటగణవిదారికమలలోచనీ।నీరూపముజూడనేనుగోరితాను।శౌరిసహోదరీశాకంభరీదేవీ॥ తల్లి ॥ ౩ ॥రామాపంచబ్రహ్మస్వరూపిణిపరంధామాకరుణించవే। శ్యామలకోమలసత్యస్వరూపిణి। కామేశ్వరీభువనకారణయోగినీ॥తల్లి ॥ ౪ పంచాగ్నుల వేంకటార్యశరీరిణీ। పంచాయుధధారిణీ। పంచదశాక్షరిపరమమంత్రేశ్వరీ।చెంచురామకవిసామ్రాజ్యదాయినీ ॥తల్లిపరదేవిసకలసన్మునికల్పవల్లిననుబ్రోవవే॥౫॥

మోహనరాగము-త్రిపుటతాళము.

మోహనాకారరమణీ। మానిలోకదినమణీ। సాహసమునుగృహదేహమునునే। సత్యమనియెంచకనుమొక్కితి।శ్రీహరినిజమాయామయమతి। చిత్సుఖసందాయినిపాపవి। దాహముశమియింపజేశినిజదాసునిగానొనరించుమునను ॥మో॥ ౧ ॥ హైమవతీభగవతీయంబుజాక్షిమదవతీ। నీమములును। జపహోమములును। నీవెయనినమ్మితినిసతతము। నీమదిమరియేమోతెలియదు। నీరజగర్భాండవిలాసినీ। నీమతమునుగాకవేరెమరియేమతమందునచరియించను ॥మో॥ ౨ ॥ గోత్రరాజసుతసయా। కోమలాంగరిపుజయా। మిత్రతుహినకరవాయుసఖులూ। మేదినిపైవెలుగుచుండెటి। సూత్రమునీమాయామహిమని। సురముఖయోగీంద్రులుపరమపత్నైనుతించినిన్నుబహు। విధములుగావరములువేడిరి ॥మో॥౩॥చండముండవిభంజనీ। సాధుసంచయరంజనీ। దండధరునిభయతాపములనే। దలచిమదియెందుబహుసృక్కితి। దండమునీపాదాంబుజములకు। దైన్యపుజ్ఞానాన్వితమానము। ఖండముగాఖండజేశినను। పండితపతిగానొనరిం

చుము ॥మో॥ ౪ । కాంచనాద్రివిహారిణీ । కామకోటివిలాసినీ । పంచగగనసుఖవాసినిశ్రీ । పంచదశిమంత్రసువిచారిణి । పంచాగ్నులవరవేంకటరూపిణి । పాకటలక్ష్మీకరయోగిని । చంచలశతకోటిభాస్కరులమించి నతేజముధరియించిన ॥మోహనాకారరమణి ॥౫॥

కేదారగౌళరాగము-ఆదితాళము.

ఆలస్యముయేలానమ్మా । పాలించవేబంగారుబొమ్మదేవీ । యీలోకంబును।యీశరీరమునుయీజీవనమునిత్యముగాదు । ఫాలాలోచనప్రాణనాయకీ । శ్రీలలనామణీచిన్మయరూపిణీ । బాలాశుభలీలా । బకశామునీంద్రపరిపాలాశీలా । నీలోకపటమునేలనమ్మాయిది । చాలునీకుపదివేలవందనములుయిక ॥ఆ॥ ౧ ॥ నారాయణీలోకనాయకియోగినీ । సారసదళనేత్రిస్తంభినిజయినీ । ధారణాయోగాదిధర్మపరాయణి । వీరమోహినీనమువేదస్వరూపిణి । గౌరినీదారిచేరినమ్మినానుకోరి । తారి। అరణాగ్నయంత్రేశ్వరిమధుమతి । శౌరిదేందుముఖిసకలశుభంకరియిక ॥ఆ॥ ౨ ॥ ప్రాణాదిదశవిధపవనములనుఘనత్రి । వేణీసంగమస్థానవేదికెయెందు। రాణింపకేశివాసిరహితమొందించేటి । జాణతనమునాకునిజంబుగాదెల్పుము । వాణీఅలివేణీరమణిబాణకులిశపాణీయరుణీ । స్థాణువనజభవ । దామోదరసంతాపిణవిబుధులదాక్షాయణిసెకెక ॥ఆ॥ ౩ ॥కాలరుద్రప్రతీకాశుడైజగతిలో । వాలినమహిషునివధియించిమించి। లీలామాయాయోగజాలముగలిగిన । కాలసంకర్షిణీకామకోటీశ్వరి । కాలానలజ్వాలాకీలామదజలకల్లోలా ।ఫేలా। లోలనేత్రిబుధలోకసదాసురసాలరూపిణీశాతోదరిశివసతి॥ఆ॥ ౪ ॥పరమేశ్వరిశ్రీపంచాగ్నివేంకట । గురురూపధారిణీకోకిలవాణీ । శరణాగతుండనైచెంచురామకవినై। నిరతమునిన్నునేను। నెరనమ్మియున్నాను । అరుణారుణకిరణాచరణాంమణిగణసంభరణాభరణా శరశరాసనసుశంఖశచక్రములుధరించివెలైటిపరమసువాసినియిక॥ ఆలస్యము॥౫॥

ఆహిరిరాగము-ఆదితాళము.

జంభవైరికరికుంభపయోధరయుగళే ।మాంపాలయనిత్యం । జాతరూపరత్నోజ్జ్వలభూషణసుగళే । వరదేవపరమేశ్వరి । శంభుహృదయసరసీరుహాభ్రమరి । చండముండకులతతిజయసమరె । కుంభిపిజయమందగమనరుచిరే । కోటికోటిప్రద్యోతనభాస్వరె ॥జం॥ ౧ ॥ నవరసాలపల్లవ

మృదుపదకమలే । శరణాగతసులభే । నాదబిందుపరిపూర్ణకళామయ విమలే । కామేశ్వరిదేవి । భవవిరించినారాయణరూపే । పరమసాంద్ర సత్కరుణాలాపే ।నవరసాన్వితసుగీతకలాపే । నారదాదిమునిమండిరదీపే ॥జం॥ ౨ ॥ సకలభువనమోహనమందస్మితవదనే । మణిఖచితకిరీటే । సరసకుందకుట్మలసుందరతరరదనే । చతురంగబలేశ్వరి । ప్రకటవిష్ణుమాయామయగాత్రే । పరమయోగవిజ్ఞానచరిత్రే । సకలకలుషకర్మాదిపవిత్రే । సత్యధర్మపరిశీలనసూత్రే ॥జం॥ ౩ ॥ రత్నకుండలవిరాజితరుచిరకపోలే। శోణాధరబింబేరజితకుధరసౌభాగ్యఫలప్రదశీలే । మదఘూర్ణితనయనే । నూత్నదాడిమీకుసుమశరీరే । నూపురాంకపాదాబ్జసుందరే । యత్నవిజితరాక్షసపరివారే । యజ్ఞయోగదీక్షాసుఖసారే ॥జం॥౪॥పంచవహ్నిశ్రీవేంకటగురుకులచంద్రేధరణీధరతనయే । భక్తలోకపరిపూరితకరుణాసాంద్రేభవరోగనివారే । పంచకోశమయప్రకృతివిలాసే । పద్మరాగభూషణసంకాశే । చెంచురామకవిహృదయనివేశే।సప్తకోటిమంత్రార్థవిశేషే । జంభవైరికరికుంభపయోధర ॥౫॥

పూర్ణషడ్జమరాగము.రూపకతాళము.

పూర్ణషడ్జమస్వరముగూర్చిపూజజేతునూపరి ॥పూర్ణ॥ వర్ణనీయమైననీదు । వైఖరియనుమతిదీరగ ॥పూర్ణ॥ భోగవతిగోత్రధృతి।భానుమతిగౌరీ । యోగినీమహార్థరూపిణి । భోగతల్పనిజసోదరి ॥పూర్ణ॥ ౧॥ వేదముఖినిత్యసుఖిమోదినిమహేశీ। వాచమేలనమ్మనాతో వాదుదేవికాత్యాయని ॥పూర్ణ॥౨॥ పంచదశమంత్రశశిలాంచనవతికాళీ । పంచకోశసాక్షిరూపిణి । చెంచురామకవిపోషిణి ॥పూర్ణషడ్జమస్వరముగూర్చిపూజజేతునూ ॥

కమాజురాగము ఆటతాళము.

శాంకరీనినుసంస్మరించని । సకలవిధముల జేయువానిప్రబంధమూ। కలుషబంధమూ ॥౧॥ పార్వతీనినుపూజజేయక । పరులబాగడెటివానినవరసగీతమూ । దుఃఖవ్రాతమూ ॥౨॥ శాంభవీనినుగాంచిసతతము । శరణుబొందనివానిమానుషజన్మమూ మహిషజన్మమూ ॥౩॥ దేవినినుకీర్తించకనుచెడితీర్థయాత్రలదిరుగు వానిప్రతాపమూనరకకూపమూ ॥౪॥ భారతీనినుసంతతంబును । భజనజేయనివానిమంత్రవిచారమూఅంధకారమూ॥౫॥ భార్గవీనినునమ్మజాలని । పాపకర్మునిమూఢమానుషవేషమూ । రవిపరివే

షమూ ॥౬॥ గౌరినీచరిత్రత్రయంబును।కౌశలమునపఠించనేరనికరణమూ। సద్యోమరణమూ॥౭॥ కాళికినినుబిలువజాలనికార్యమనుజానిజపతపోవ్రత। నియుతులూయమునిదూతలూ ॥౮॥ శంభుసతీనినుమరచిసతతము। చపలుడైవర్తించువానిసుశీలమూ। హాలాహలమూ ॥౯॥ భగవతీనీపాదములకు సుబ్రహ్మణ్యతుడైశేవించనేరనిరోగమూ। దీర్ఘరోగమూ ॥౧౦॥ మధుమతీ నీనామమంత్రము।మనసుదీరగజపముజేయనిజ్ఞానమూగగనప్రసూనమూ॥ ౧౧॥ భానుమతినినుసార్వకాలము। భక్తితోబాగడనిదురాత్మ్యుని। కాలమూ।యింద్రజాలమూ ॥౧౨॥ మదవతీనీమతమునొల్లక। మందుడైవర్తించువానిశరీరమూభూమిభారమూ ॥౧౩॥ జననినినుహృద్గగనమందున। చేర్చిధ్యానించనినరాధముబోధలూ। యమునిబాధలూ ॥౧౪॥ చంద్రముఖి నీకర్పణముగా। జేయకనుభుజియించువానిస్వరూపమూ। ప్రేతధూపమూ ॥౧౫॥ మధురవాణీనిన్నుజూచినమస్కరించనియోగపురుషునిపుత్రుడూ। వంధ్యాపుత్రుడూ ॥౧౬॥ కామకోళికశామయీనీ। కధలువిననిధరామరేంద్రునియీవులూ। యండమావులూ॥౧౭॥గిరికుమారీనీమహాత్మ్యము। గురుతుదెలియకపూజజేశెటిపురుషుడూ। స్థాణుపురుషుడూ॥౧౮॥ వేంకటార్యునిరూపునీవని। యెంచిప్రార్థించనిమునీంద్రునియోగమూ।భస్మయాగమూ ॥౧౯॥ చెంచురామకవీంద్రపోషిణి। శంఖచక్రగదాదిసాధనధారిణి। నిగమపరాయణీ ॥౨౦॥

కళ్యాణీరాగము- ఆటతాళము.

సంతోషమొందించవేజగదీశ్వరీ। సత్పురుషునిజేయువేశాంతశమదమాది। సద్గుణములునన్ను। సంతతమునుబొందేసాధనమెరిగించి। యంతరంగమునందునీపదధ్యానయోగమునిల్చునటు। లేకాంతభావమునొందజేశియు। కరుణతోడనునాదుమనమును ॥ సం ॥ ౧ ॥ మందారకుసుమప్రియామహాకాళీ। మలయాచలనిలయా। వందనంబులుజేశినీపద। వనజములకునుపూజజేయుచు। దేదమునుదేహేంద్రియాదుల। సందడినినీయెందెయుంచితి ॥ సంతోష ॥ ౨ ॥ పరమశంకరరమణీకామేశ్వరీ। ప్రజ్ఞానమయరూపిణీ। ధరణిలోపలశ్రీమదాంధుల। దలచికొల్వగలేనుజననీ। పరమపదమునుబొందుటకుసా। భాగ్యకరమగువరములొసగియు ॥ సం ॥ ౩ ॥ శ్రీరామానందమయీత్రిపురేశ్వరీ। శ్రీచక్రబిందుమయీ। దూరమానాదిక్కుజూడవు। దోషమేమియుజేశినాడను। భారమాన

సుబల్కరించవు । బ్రహ్మారాక్షససంఘదమనీ ॥ సం ॥ ౪ ॥ శిందూరద్యుతిలహరీమంగళగౌరీ । శ్రీనారాయణసోదరీ । మందమధురాలాపములతోమందబుద్ధినిదొలగజేశి ప్ర । బంధవాసనలోననిలుపక । బ్రహ్మావిద్యామతిని జేయుచు ॥ సం ॥ ౫ ॥ పంచాయుధధారిణీవసుదాయినీ। ప్రమధగణాధీశ్వరీ । పంచదశిమంత్రాబ్ధివాసినిబ్రహ్మాలోకసుఖప్రదాయినీ । చెంచురామకవీంద్రపోషిణి । సకలదురితనివారిణీనను ॥ సం ॥ ౬ ॥

సురటరాగం-అటతాళం.

పరిపాలయమాంశివమహాళ్లేపరమమంగళచిక్కళ్లే । మృదుపదయుగళ్లే ॥ ప ॥ పరిపూర్ణసౌందర్యచంద్రబింబాస్యే । భవకేశవోపాస్యే । మహామాయె । పరమార్థరహస్యే । దేవదేవి । నిరతిశయబోధస్వరూపే । నిఖిలభువననుతప్రతాపే । తరణిచంద్రాతీతరూపే । దనుజసముదయాజయకలాపే ॥ ప । ౧॥ నిలయీకృతసౌషుమ్నశుభకరరంధ్రే। నిజభక్తనిస్తంద్రే । చక్రేశ్వరిశోణప్రభాసాంద్రే । నారాయణి । మలయగిరిశిఖరాగ్రసదనే । మహితకుందసమానరదనే । కలుషశుంభనిశుంభమధనే । కామతంత్రవిలాసవదనే ॥ ప ॥ ౨ ॥పురహారమన్మధావేశనటనమంత్రే । పురుహూతసుఖతంత్రే ।లలితాంబికేస్మరనిగమమయయంత్రే। దాక్షాయణి । సరసిరుహాభవవరదహస్తే । సర్వమంగళసుప్రశస్తే । దురితభయశమనేనమస్తే । ధూర్జటిసువామాంగసంస్థే ॥ ప॥ ౩ ॥ పంచాగ్ని వేంకటపరమగురురూపిణిబ్రహ్మాయజ్ఞపరాయణి । శాకంభరి । చంచలశుభలోచనీ । భగమాలినీ । చెంచురామకవీంద్రజననీశర్మదాయినిత్రిగుణశాలిని । కాంచనాద్రినివాసినిఘన । కనకకుంభపయోధరిత్వం॥ పరిపాలయమాం॥౪॥

శహనారాగం - అటతాళం.

మాహేశ్వరివిద్యావంతంశ్రీమంతంచ । మాంకురుశాకంభరి । బాహులేయహేరంబాదిజననినిత్యసాహసవితరణసద్గుణమణినిత్యం ॥మా॥ ౧ ॥ త్రైమూర్త్యాతీతపరంజ్యోతిరూపిణి । త్రైలోక్యసమ్మోహిని । కామేశ్వరిసర్వకళ్యాణదాయిని ॥ కామాక్షీభువనైకకారణరూపిణి ॥ మా॥ ౨ ॥ వామోరున్యస్తమంజీరలసద్రత్న । వరపాదారవిందే ॥ సామాదినిగమప్రసంగవినోదిని । కామకోటీశ్వరికమనీయభూషణి ॥ మా ॥ పంచమకారసువ్యక్తమహిద్భుత । పరమానందతుందిలే। పంచాగ్నివెంకటపరమ

గురురూపిణి । చెంచురామకవిశాంతప్రదాయిని ॥ మా ॥ ౩ ॥

శ్రీరంజనీరాగం - ఆదితాళం.

పాహిమాంసంగీతమాతృకే । పరమధన్యచరితే ॥ పా ॥ శ్రీహరీశబ్రహ్మేంద్రశరీరవిలాసే । శివమనోవికాసే ॥ పా ॥ ౧ ॥ మంగళసౌందర్యరూపిణి । మధునిశాటనాశని । మన్మథప్రాణసంజీవని । భృంగసంఘజయబంధురసుందరవేణి । పుష్పబాణపాణి ॥ పా ॥౨॥ భైరవాష్టకపరివేష్టితే । పంచవదనసహితే । భార్గవీభారతీసేవితే । చారురత్నచామీకరహారవిశేషే । సత్యధర్మభాషే ॥ పా ॥ ౩ ॥ పంచకోశసాక్షిరూపిణి । బ్రహ్మలోకపావని । పంచదశిమంత్రయోగిని । పంచవహ్నికులవేంకటసన్నుతగాత్రి । పద్మపత్రనేత్రి ॥పా ॥ ౪ ॥ చెంచురామకవిసంరక్షణి । చక్రపాణిసోదరి । శాంభవిప్రతిపక్షశిక్షణి । పంచయజ్ఞఫలదాయిని త్రిభువనవలయే । పర్వతేంద్రతనయే ॥ పాహి ॥౫॥

ఆరభిరాగము - ఆదితాళము.

ఆరభిదానములుగలిగినకామాదిగుణవికారములుబోకయుండునా ధీరుడైశమదమాది । దివ్యగుణగరిష్టుడై । ధారణాయోగంబుచేసి । ధ్యానముగలిగినవాని ॥ కారభి ॥ ౧ ॥ చండముండకులవినాశని । శివదూతిదేవీ । దండధరభయవిమోచనీ । మండలత్రయముమీరి । కుండలీస్థానంబునందు । నిండుగారాజిల్లినట్టి । నిన్నుజూచుచున్నవాని ॥ కారభి ॥ ౨ ॥ ఆసురీదైవీస్వరూపిణీ । నిఖిలసరసిజాండసృష్టిప్రళయకారిణీ । వాసనత్రయములవదలి । వైఖరీనాదరతుడై । శ్రీసహస్రారమున శిద్ధుడైవీక్షించువాని ॥ కారభి ॥ ౩ ॥ జ్ఞానయోగభోగలోచనీ । వేదాంతవిద్యాగాననటనానిత్యమోదినీ । దీనభావమంతవిడచి । దివ్యదృష్టిగలిగిమహా । మానముధరియించినీకు । మ్రొక్కినుతియించినవాని ॥ కారభి ॥ ౪॥ పంచకోశసాక్షిరూపిణీ । పరమేశినిష్ప్రపంచనిత్యనిర్విశేషిణీ । పంచవహ్నిశ్రీవేంకట। బ్రహ్మరూపమేసేవని । పంచదశశిద్ధులచే । భాసిలుచున్నట్టివాని॥కారభి॥ ౫ ॥ కామకోటియంత్రరూపిణీ । కళ్యాణిచెంచురామకవిసౌఖ్యదాయినీ। వ్యోమముఖపంచభూతముల । యెందువ్యాపించియుపరం । ధామమైయున్నట్టినీదు । నామముపఠియించువాని । కారభిదానములుగలిగిన కామాదిగుణవికారములుబోకయుండునా ॥౬॥

### యమునాకళ్యాణిరాగము-ఆదితాళము.

వినయమునాకళ్యాణీనిన్నువినుతించెద నేనూ । మరిబహు॥ వినయము ॥ అనుదినమునునినుగనుగొనగోరితి । ఆదరించవమ్మాదేవీ ॥ వి ॥ కుటిలదనుజకులనికరవినాశనికుందబృందరదనా।పటుతరమృగమదనిస్తులసుందరఫాలభాగవదనా ॥ వి ॥ ౨ ॥ సృష్టిస్థితిలయకారణరూపిణిసుప్రసన్నరమణీ । అష్టప్రకృతివిలాసవికారిణియఖిలభువనజననీ ॥వి ॥ ౩ ॥ హరిహయముఖసురసముదపూజితసురుచిరపదయుగళా । పురహరకృతఘననిపుణమనోహరభూరినటనబగళా॥ వి ॥ ४ ॥ పంచవహ్నివేంకటగురురూపిణిపరధన్యచరితా । చెంచురామకవిశుభవరదాయినిచంద్రమౌళివనితా॥వినయ ॥ ౫ ॥

### నీలాంబరిరాగము-ఆదితాళము.

నీలాంబర గాత్రిపురహరసతి॥ నీలా ॥ లీలాజాలాసుశీలా । బాలామణిదాక్షాయణిపాలించవెకాత్యాయనిసుందర ॥ నీ ॥ జంభవైరిగజకుంభసుకుచయుగళా। జననమరణనాశనిశాతకుంభమణిభూషితఘనబగళా శుంభరాక్షసవిఖండనసునిశిత । శూలచక్రపాశాంకుశధరి ॥ నీ ॥ ౧॥చండరశ్మివిధుపావకరుచినయనా । జలజభవమహేశ్వజలజనాభముఖపంచకఘనశయనా । భండదైత్యదోర్దండవిభంజని । బాహులేయజననీమదవతి॥ నీ ॥ ౨ ॥ పంచవహ్నికులవేంకటరూపిణియరుణీ । పరమపదనివాసినిపంతమేలననుబ్రోవవేశుభకరిణీ । చెంచురామకవివంశసుపోషిణి । సార్వభౌమఫలదాయినిఘన॥నీ ॥ ౩ ॥

### తోడిరాగము-రూపకతాళము.

లోకమోహినీదేవీలోకసృష్టికారిణి । లోకజననిభానుమతీలోకవిలయకారిణీ ॥ ౧ ॥ గానమోదినీదివ్యజ్ఞానయోగగామినీ । మానవతీశంభుసతీమంగళప్రదాయినీ ॥ ౨ ॥వేదరూపిణీయణిమాదిశిద్ధికారిణీ । నాదబిందుచిత్కళాప్రసాదకరవిలాసినీ ॥ ౩ ॥ సుందరాకృతీశతానందలోకసుఖగతీ । ఇందుముఖీ మధుమతీపరిపంధిమేఖసదాగతీ ॥ ४॥ పంకజేక్షణెమహాపాపకర్మవిమోచనీ-వేంకటార్యరూపిణీనావినుతివినుమువారుణీ ॥౫॥ కాంచనాంబరీగౌరీకాంచనాద్రివాసినీ । చెంచురామదాసహృదయజలజభానురూపిణీ ॥ లోకమోహినీ ॥ ౬॥

జంఝూటిరాగము-అటతాళము.

దాక్షాయణీదేవీనేనూ । తల్లివంద్రివినీవనిదలచియున్నానురక్షిం
చుమని మొ్రక్కినానూ । రాజరాజేశ్వరివనినమ్మియున్నానూ ॥ దా ॥ ౧
శర్వాణీగౌరీశుకవాణీ । దేవీ । సర్వేశ్వరీమాతంగినిఅలివేణీ । గర్వితద
నుజశోషిణీ । మహాగాంధర్వగీతాసాధనవాగ్వాదినీ ॥ దా ॥ ౨ ॥ నామొ
రవినవుకోపమాలేక । నామెందుజెందినపూర్వశాపమా । రామామణి
నాపాపమా । నీకురాజీలేనిమనసునాదిలోభమా ॥ దా ॥ ౩ ॥ పంచాగ్ని
వేంకటమూర్తి । దేవీబ్రహ్మరాక్షసముఖభూతసమవర్తి॥ ౪ ॥ పంచకోశమ
ధ్యవర్తీ । దేవీచెంచురామకవిజ్ఞానవిస్ఫూర్తీ ॥ దాక్షాయణీ ॥

ఆనందభైరవీరాగము - ఆదితాళము.

సామవేదపరాయణి శ్రీనారాయణీదేవీ । సోమసూర్యాగ్నిలో
చనీశ్రీనారాయణీ ॥ ౧ ॥ కామకోటిసుందరాంగీశ్రీనారాయణీదేవీ । వా
మాచారప్రియంకరీశ్రీనారాయణీ ॥ ౨ ॥ సామజేంద్రజయగామినీశ్రీనారా
యణీదేవీ । కామసంజీవనకరిణీశ్రీనారాయణీ ॥ ౩ ॥ కామక్రోధాదిశమ
నీశ్రీనారాయణీదేవీ । రామామణీమహాకాళీశ్రీనారాయణీ ॥ ౪ ॥ భీమరక్త
బీజమథనీశ్రీనారాయణీదేవీ । కామేశ్వరీకాత్యాయనీశ్రీనారాయణీ ॥ ౫ ॥
సోమాంకమౌళిమోహినీశ్రీనారాయణీదేవీ । హైమవతీదాక్షాయణీశ్రీ
నారాయణీ ॥ ౬ ॥ కామకేళితరంగిణీశ్రీనారాయణీదేవీ । సామరస్యప
రాయణీశ్రీనారాయణీ ॥ ౭ ॥ భీమార్థాంగశరీరిణీశ్రీనారాయణీదేవీ । శ్రీ
మహారాజ్ఞి భవానిశ్రీనారాయణీ ॥ ౮ ॥ వ్యోమాతీతస్వరూపిణీశ్రీనారా
యణీదేవీ । ధీమానసాదిసాక్షిణీశ్రీనారాయణీ ॥ ౯ ॥ శ్రీమన్మహారాజేశ్వ
రీశ్రీనారాయణీదేవీ । కామరాజపీఠేశ్వరీశ్రీనారాయణీ ॥ ౧౦ ॥ స్త్రీమ
ణీభవరోగశమనీశ్రీనారాయణీచెంచురామకవినిరక్షించవేశ్రీనారాయణీ
॥ ౧౧ ॥

జంఝూటిరాగము - అటతాళము.

నీకన్నతలివంద్యులెవరుయీజగతిలో । నీరజదళనేత్రీకామేశ్వరీ,
శోకతాపములనివారింపగాజేశి । సౌఖ్యమొందించవేకామేశ్వరీ ॥ నీ॥౧ ॥
నీనామస్మరణకన్నమవ్యాపారములేదు। నిఖిలభువనేశ్వరికామేశ్వరీ। మా
నాభిమానముల్ మణిమంత్రయోగముల్ । మానితినసుబోధుకామేశ్వరీ॥నీ॥
౨ ॥ నీపాదశేవకన్ననుజపమునులేదు । నీలకుంతలవేణికామేశ్వరీ । చే

పాపములునన్నునైనయంటకుండగజేయు। నీపారిపుగౌరీతికామేశ్వరీ ॥నీ॥ ౩ ॥ నీచరిత్రముకన్ననితరమతములేదు - నిరుపమసుందరీకామేశ్వరీ । వాచామగోచరవైభవరూపిణీ । చూచిమాటాడవేకామేశ్వరీ ॥ నీ॥ ౪ ॥ నీదర్శనముకన్ననితరకోరికలేదు । నిత్యకళ్యాణిశ్రీకామేశ్వరీ । వేదాంతవేదినీవింధ్యాద్రివాసినీ । బోధించిమన్నించుకామేశ్వరీ॥ ౫ ॥ నీ ॥ నీమంత్రదీక్షకన్నన్యవ్రతమునులేదు । నీలలోహితరమణీకామేశ్వరీ । శ్రీమానసీమణిచిద్రూపిణీగౌరీ । కామకోటీశ్వరీకామేశ్వరీ ॥ నీ ॥ ౬ ॥ నీకన్నగురురూపమెవరయిరాపుడమిలో। లోకేశ్వరీదేవీకామేశ్వరీయీకారబీజాక్షరీనీవుకరుణించి । నాకువరమియ్యవేకామేశ్వరీ ॥ ౭ ॥ పంచాగ్నివేంకటపరమగురురూపిణీ । కాంచనాంబరిదేవీకామేశ్వరీ । చెంచురామకవిని । శుద్ధాత్మునిగానుదీవించిరక్షించవేకామేశ్వరీ ॥ నీ ॥ ౮ ॥

యమునాకళ్యాణీరాగము - ఆదితాళము.

పరాపరేశ్వరీపరాకేలనను । బిరానబ్రోవగదే ॥ ప ॥ పురారిసతివనివరంబడిగితిని । నిరాకరించకుమురారిసోదరి ॥ ప ॥ ౧ ॥ జరామరణములభరించలేనిక । హరించుపాపమునిరంతరంబును ॥ ప ॥ ౨ ॥ సురేంద్రముఖులకుతరంబుగానియు । సురాళిద్రుంచినపరాక్రమముగల ॥ ప॥ ౩ ॥ చరాచరంబులభరించివెల్గెటి । హరీశవిధిముఖస్వరూపధారిణీ ॥ ప ॥ ౪॥ పరాకాశచిత్స్ఫురత్ప్రకాశిని । దురాచారఘనదురంతరూపిణి ॥ ప ॥ ౫ ॥ స్థిరంబుగనుకనికరంబుతోడను । వరంబొసగిశ్రీకరంబుజేయుము ॥ప॥ ౬॥ కరీంద్రగామినిమరాళవాహని । స్మరారిమోహనశరీరధారిణీ ॥ ప ॥ ౭ ॥ నరుండనేపామగుండజడుడను । పరార్థమెరుగనుపరించిజననీ ॥ ప॥ ౮॥ ధరిత్రిలోచెంచురామకవినై । స్మరించితినినామొరలాలింపవగదే ॥ పరాపరేశ్వరి ॥ ౯॥

శ్రీరాగము - రూపకతాళము.

తుహినాచలతనయాశివ । మహిళామణిశ్రీచరితా ॥ తు ॥ మహితాంబుజదళలోచని మహాకలుషసంహారిణి ॥ తు ॥ మొరాలించియువరాలొసగుపరాపరాకృతిమురారిసురసూదనసిజసోదరి। పరమేశ్వరిశాంకరిశ్రీకరినారాయణివారుణి ॥తు॥ ౧ ॥ అనారతముఅనాదరణమునామెడవలదునా । మనమందునస్మరియించెద । జననీతరుణీమణిపావనిదాక్షాయణిశాంభవి ॥తు॥ ౨॥ సతీసుగుణమతీసుభగవతీమదవతీరతీసతతంబునువేంకట

గురు । మతసాంప్రతసుప్రతమే శుభమని నేప్రార్థించితి ॥ తు ॥౩॥ వికా
రములసకామముగ । ప్రకాశము జేయుక । ప్రకటంబుగ చెంచురాముని । క
కలంకము శాంతము దాంతముకృపతో కలిగించవే॥తుహినాచలతనయా॥౪

కేదారగౌళరాగము-అటతాళము

బంగారుబొమ్మనీపాదకమలంబుల ।శృంగారమెన్నడుజూచెదనమ్మా।
అంగనామణిసకలాగమరూపిణీ। సంగీతసాహిత్యసహితమృదువాణి ।గం
గాధరలక్ష్మీకాంతస్వరూపిణీ । గాంగేయనవరత్న ।కలితవిభూషణీ॥బం॥
మోక్షలక్ష్మీనీమమృదువచనంబులు ।పక్షిణముగ నెన్నడాలింతునమ్మా। సా
క్షాత్పరమేశ్వరీసాధుసంతోషిణీ । లక్ష్మ్యాత్రయాతీతలావణ్యశాలినీ ॥ బం॥
౨ ॥ లోకమాతనాకురూఢిగావరములు । నేకాంతమున నెన్నడొసగెద
వమ్మా । లోకవిమోహినీలోలాక్షిజన్మాది । శోకనివారిణీసూర్యశశిలో
చనీ ॥ బం ॥ ౩ ॥ పంచాగ్నివేంకటబ్రహ్మణ్యరూపిణి । పంచభూతేశ్వరి
పాలించవమ్మా । కాంచనాంబరినిత్యకళ్యాణీకౌమారీ । చెంచురామక
విశాంతప్రదాయినీ ॥ బంగారు ॥ ౪ ॥

భైరవీరాగము-అటతాళము.

సప్తకోటిమహామంత్రస్వరూపిణీ । సకలనిగమజననీ । సప్తాశ్వశ
తకోటిసదృశప్రకాశినీ । గుప్తతరయోగినీకోదండధారిణీ ॥ స ॥ ౧ ॥ అ
ధ్యాత్మవిద్యాప్రసన్నమంగళగౌరీ । ఆనందసుఖదాయినీ । మద్యమాంస
ప్రియమానసావేశినీ । సాధ్యసంతోషిణీసామ్రాజ్యశాలినీ ॥ స ॥ ౨ ॥ ప
రమసువాసినీశ్రీచక్రధారిణీ । బ్రహ్మాదిసురపావనీ । నిరుపమసౌందర్యనీల
శరీరిణీవరమార్థదాయినీ శాకంభరీదేవీ ॥ స ॥ ౩ ॥ పంచాస్యులవేంక
టార్యస్వరూపిణీ । పాషండజననాశనీ । చెంచురామదాససకలశుభంకరీ
కాంచననవరత్నకలితవిభూషణీ ॥ స ॥ ౪ ॥

ముఖారిరాగము అటతాళము.

శ్రీకరీస్త్రీవశంకరీసకలలోకశ్రీకరీస్త్రీవశంకరి । ప్రాకటంబుగనీదుమృదుప
దపద్మములు నెరనమ్మితినినా । వ్యాకులంబును బాపిననునీ । వాదరించవె దే
వదేవి॥శ్రీ ॥౧॥ భారతిని న్నుజేరితి।నీ శేవయు గౌరితి।ప్రకృతిమీరితి తారకాంత
కజననిభగవతితనయుడను నే జేయుఘనతర । నేరములు శమియింపవేమధు
వైరిసోదరియోగదాయినీ ॥ శ్రీ॥౨॥ యోగినీరాజభోగినీ। కామాదిగుణవి
రాగిణీమహాకాళినీ । నాగభూషణనాయకీనీనామమును పఠియించెదనుయ

సు । రాగమునవరమియ్యవమ్మా రాజరాజేశ్వరిభవానీ ॥ శ్రీ ॥ ౩ ॥ కాళికాజ్ఞానకేళికా । హిమవద్గిరిబాలికామంత్రమాలికా । కాళరాత్రిమహేశ్వరీసురకామినీజనమణిసురేశ్వరి। కౌళతంత్రవిధాయినినాకలుషములఁదొలగించవమ్మా ॥ శ్రీ ॥ ౪ ॥ శారదారణవిశారదా । మోక్షామృతముగోరెదాఖలులదూరెదా । నారదాదిమునీంద్రపోషిణినాదబిందుకళాస్వరూపిణి । ఘోరరోగనివారిణినాకోరికలుఫలింపజేయవె ॥ శ్రీ ॥ ౫ ॥ మించితినినుసేవించితి । యెల్లప్పుడుపూజించితి । కమువర్ణించితి। పంచకోశవిలక్షణీసౌభాగ్యవిద్యేశ్వరిభవానీ । చెంచురామకవీంద్రపోషిణిశర్మదాయినిరాజయోగిని॥శ్రీ॥

శ్రీరంజనిరాగం - రూపకతాళము

శివసతిసంగీతాభారతి । పరిపాలయమాంశ్రీరతీశచీసుసేవితే । భువనవిలాసినిశాంకరి । భుక్తిముక్తిదాయినితగుణిశ్రీరమణీ ॥ శి ॥ ౧ ॥ ఘనసారసుకస్తూరిసుగంధాంగిశాతోదరి । సనకసనందనసన్నుతసంవిదాత్మరూపవిలసితే శ్రీలలితే ॥ శి ॥ ౨ ॥ పరిపూర్ణోజ్వలసుకుముద బాంధవసుందరజయముఖి। పరమశుభంకరిసురసుతపావనాంఘ్రిపంకజయుగళే॥ శ్రీబగళే ॥శి॥ ౩ ॥ పంచాగ్నివేంకటసుబ్రహ్మణ్యాకృతిమధుమతి । పంచాశద్వర్ణేశ్వరిచెంచురామకవివరవరదేశ్రీశిరఘే ॥శి॥ ౪ ॥

శహానారాగం - ఆదితాళం.

మాంపాహిమహాకాళిమహారాజరాజేశ్వరి । సంపూర్ణచంద్రముఖిసకలభువనేశ్వరిత్వం ॥ మాం ॥ ౧ ॥ కర్పూరసాంద్రవీటికబళితముఖబింబె । సర్వభూషణానందసద్గుణనికురుంబే ॥ మాం ॥ ౨ ॥ రతిపతికార్ముకరమణియ్యసుభ్రూలతె। శృతికులనిలయేసవిశుద్ధకైవల్యాకృతే॥మాం॥ ౩ ॥ కారుణ్యరసపూర్ణకమలదళాయతాక్షి । చారునవమణిపీఠాధారిణిశ్రీకామాక్షి ॥ మాం ॥ ౪ ॥ పంచాగ్నివేంకటపరమదేశికరూపే । చెంచురామకవీంద్రసేవ్యమానప్రతాపే ॥ మాం ॥ ౫॥

సురటరాగము - ఆదితాళము.

భవానిపాహిమాంవరవరదేభగవతి ॥ భ ॥ శివేకృపామతిజగద్విలాసిని । భవాంబునిధితరణేభగవతి ॥ భ ॥ ౧ ॥ తపస్వినిచిద్ఘనాఘనాకృతి । ప్రసన్నసౌఖ్యకరిభగవతి ॥ భ ॥ ౨ ॥ సరస్వతిసుప్రసన్నముఖిహరి । హరాదినిజజననిభగవతి॥ భ ॥ ౩ ॥ అనాదిమాయాస్వతేమహేశ్వరి ।

ధనేశ్వరీరమణిభగవతి ॥ భ ॥ ౪ ॥ చరాచరాంతస్థితప్రకాశిని । చెంచురామజననిభగవతి ॥ భవానిపాహిమాం ॥

### దర్బారురాగం-ఆదితాళం.

వరదేభవాని । పరమకళ్యాణందేహి । ప్రకృతిస్వరూపిణిసుజన ॥ వ॥నిరుపమసుందరినిఖిలశ్రేయస్కరి । గిరివరసుకుమారి । కేశవసోదరిసుజన ॥వ॥ ౧ ॥ స్ఫురితధనుర్బాణశూలకులిశపాణి । వరమృదుమధురవాణివనజపత్రేక్షణిసుజన ॥వ॥ ౨ ॥ విధిముఖసురవధూటీవినుతసుగుణపేటి। మదనవైరివధూటిమంజులకటీతటిసుజన ॥వ॥ ౩ ॥ కుటిలకుంతలవేణి ।కోమలారుణపాణి । రటితనూపురశ్రేణి । రాజితభూషణిసుజన ॥వ॥౪॥ పంచాగ్ని వేంకటపరమగురురూపిణి। చెంచురామకవిసేవితయోగినిసుజన ॥ వరదేభవాని ॥౫॥

### కళ్యాణిరాగం-అటతాళం.

ఈశతాండవసాక్షిణిత్రిపురేశ్వరివీరదానశిక్షిణి । శ్రీశాంభవిగౌరిచిన్మయరూపిణి । పాశాంకుశపుష్పబాణకార్ముకపాణి ॥ఈ॥ ౧ ॥ నిస్తులదివ్యకస్తూరితిలకాంచితనిటలతటవిలాసిని । అస్తోకబోధసుఖామృతదాయిని । వాస్తోష్పతిప్రముఖవందితగుణమణి ॥ఈ॥ ౨ ॥ దాసోహంశరణాగతోస్మికృపయాదేవి । దాక్షాయణిపాహిమాం । భాసురనవరత్నప్రవిమలభూషణి । శ్రీసదాశివహృత్సరసీరుహమధుకరి ॥ఈ॥ ౩ ॥ పంచాగ్నివేంకటపరమగురురూపిణి । ప్రణవనాదవినోదిని । చెంచురామకవిసౌభాగ్యదాయిని । పంచబ్రహ్మాసనిప్రకృతివిలాసిని ॥ఈశ॥ ౪ ॥

### పూర్ణషడ్జమరాగం-రూపకతాళం.

దాక్షాయణిప్రసీదమేసరస్వతీ ।శ్రీదా। దక్షిణకాళిమహేశిదానవేంద్రకులనాశని ॥దా॥ ౧ ॥ మానవతిభానుమతిమంగళకరిశ్రీ ।జ్ఞానకళాధారిణిదుష్కల్మషఘ్నవరదాయిని ॥దా॥ ౨ ॥ నీరజభవాదిశుభదాయిని భవాని । వీరమోహినిప్రసన్నవేంకటాఖ్యగురురూపిణి ॥దా॥ ౩ ॥

### ఆనందభైరవీరాగము-ఆదితాళము.

ఆనందభైరవీవాగ్వాదినీ । నిరుపమానసుందరఘనశరీరిణీ।పరమానందవల్లీవనునీ । వాదరించుమాతల్లి ॥ఆ॥ ౧ ॥ శరణాగతుడనేనుశాంకరీసీదు । కరుణాదృష్టినిజూడుశ్రీకరీ । నాదుదురితజాలంబులనుద్రుంచివరమియ్యవమ్మ ॥ఆ॥ ౨ ॥ మాతంగకుంభసమపయోధరీ।మత్తమాతంగగమనా

లోకభ్రామరీ । రాజమాతంగీశ్వరీమహామాయావిలాసినిచి॥ దానంద॥ 3॥ పాశాంకుశచక్రాదిధారిణీ । పంచకోశవ్యతిరిక్తసుప్రకాశినీ । పశుపాశవిమోచనీసౌభాగ్యప్రదాయినీస ॥ దానంద ॥ ४॥ కస్తూరితిలకఫాలసుందరాసుప్రశస్తమంజులశంఖకంధరా । నిన్నుబ్రస్తుతించెదనమ్మపరమయోగీశ్వరీచి॥ దానంద॥ ౫ ॥ పంచాగ్నివేంకటార్యరూపిణీ।నిఖిలబ్రహ్మాండజననవిలయకారిణీదేవీచెంచురామదాసునిశిద్ధునిజేయువమ్మ ॥ఆనందభైరవీ ॥ ౬ ॥

ధన్యాసిరాగము - అటతాళము.

ధన్యాశివమోహనాంగీతుహినగిరి । కన్యావనుబ్రోవవే । అన్యదైవంబులననుసరించలేదు । యేన్యాయమునునేనుయెరుగనేరనుజనని ॥ధ॥౧ ॥ కాలసంకర్షిణికనకాద్రివాసిని । నీలలోహితనాట్యనైపుణ్యామోదిని ॥ ధ ౨ ॥ శంఖచక్రముఖసకలాస్త్రధారిణీ । శంఖసోదరకాంతిసద్గుణగణమణి॥ ధ ॥ 3 ॥ ఆధారాదిషట్క్రమలాంతరవాసిని । బోధరూపిణిపరిపూర్ణకామేశ్వరి ॥ ధ ॥ ४॥విష్ణుమాయామయవిమలవిద్యాధరి । వైష్ణవీభార్గవీవామదేవీపరమ ॥ ధ ॥ ౫ ॥ పంచాగ్నివేంకటపరమార్యరూపిణీ । చెంచురామకవినైశేవించెదనునిన్ను ॥ ధన్యాశివమోహనాంగి॥ ౬॥

కేదారిగౌళరాగము - అటతాళము.

నాకేదారిగౌళరూపిణీనీకన్ననన్ను పరిపాలించిమన్నించవమ్మా । నీకారుణ్యమునేనునిరతముగోరితి । ధారుణిలోనరులదలచలేదమ్మా । నాకార్యములనెల్లనయభక్తితోడను । నీకర్పించితినింద్రనీలకుంతలవేణీ॥నా॥౧॥ భీకరముగుమాయాప్రేరేపణమునన్ను నేకాలములకైననెనయకుండగను । లోకమందుననాకురూఢైనవరములు । నేకాంతముననిచ్చియోగీంద్రునిగజేయు ॥ నా ॥ ౨ ॥ యేకరూపముతోడవెలైబ్రహ్మమునీకళేబరమనినిర్మలమతిచేయేకాలమునునిన్నుయెంచిస్మరియింపుచు । ప్రాకటంబుగనేనుపలుమారుమ్రొక్కితి ॥ నా ॥ 3 ॥ నాకుబలమునీవేనాకుధనమునీవే । నాకుదైవమునీవేనలినాయతాక్షీ । నాకుతల్లివినీవేనాకుతండ్రివినీవే । నాకుప్రాణమునీవేనాగారివాహనీ ॥ నా ॥ ४ ॥ ఆకాశాదిపంచభూతస్వరూపిణీ । శ్రీకరయోగసంసిద్ధికారిణీ । ఈకారబీజాక్షరీశ్వరిపరదేవీ । యేకాంతముననాదుయెదుటమాటాడవే ॥ నా ॥ ౫ ॥ యేకోర్కెయునులేదుయికనువేంకటదేశి।కాకారరూపిణిపరశివరమణీ। శాకంభరీగౌరీచెంచురా

మకవికి| శోకమోహంబులుసోకనియ్యకుజననీ॥నాకేదారిగౌళరూపిణి॥౬॥

నారాయణిరాగము - అటతాళము.

నారాయణిశాంకరిరక్షించవేనారాయణిశాంకరీ । వారిరుహద శలోచనీభూరికలుషవిమోచనీ । దూరమావేంచేయుటకుసుకు । మారసుందరతరశరీరిణి ॥ నా ॥ ౧ ॥ ఘోరరాక్షసమర్దని । గోత్రపతిసంవర్ధనీ । క్షీరసాగరవాసినీదాక్షిణ్యదివ్యగుణిషిణిశ్రీ ॥ నా ॥ ౨ ॥ భారతీకుళయోగినీ । పంచబాణసుజీవనీ । నారదాదిమునీంద్రగీతానాదమోదినివేదరూపిణి ॥ నా ॥ ౩ ॥ వారుణీపంచాగ్ని వేంకటనారశింహగురుస్వరూపిణి । వీరమోహిని చెంచురామకవీంద్రునికివరమియ్యవమ్మ ॥ నారాయణిశాంకరీ ॥ ౪॥

తోడిరాగము - రూపకతాళము.

తోడితేనుదరమానేగారీ । రాకున్ననిన్ను ॥ తోడి ॥ వేడుకొనుచుబహుభంగులవేదవిదితవచనంబుల । పాడవలయుగాకనిన్ను । పట్టుగానురమ్మురమ్మని ॥ తోడి ॥ ౧ ॥కరుణారసమింపొందగ । వరములొసగుమనుచుమ్రొక్కి । శరణంచునునుతిజేయుచుశాంతభావమొందకనిను ॥తోడి ॥ ౨ ॥ హరిశంకరవిధిముఖులకుతరముగానిపరదేవివి । నరుడనేనునిన్నునరయగ । నాకువశమెవామలోచని ॥ తోడి ॥ ౩ ॥ పంచాగ్నులవేంకటగురుబ్రహ్మంబనిధ్యానింపుచు । చెంచురామకవినామముచేతనేనుమొరలిడవలె ॥ తోడి ॥ ౪॥

ఫరజురాగము-ఆదితాళము.

యేలనమ్మాయింతపంతమునామీద । శీలముశిరియొదయశేయగమనసుతాదా॥యే॥౧॥ నారదవీణాసంగీతసంమోదినీ।శారదాదేవీవేదసారార్థవేదినీ ॥యే॥ ౨ ॥ కారుకవాచకమానసములునేనూ । నీయెడభక్తికినేనిల్పిధ్యానించినాను ॥యే॥ ౩ ॥ జ్ఞానముయోగముజ్ఞానమునెరుగను ।నేనుమానవుడనునిన్నునమ్మియున్నాను ॥యే॥ ౪ ॥ పరమపావనివేంకటార్యస్వరూపిణీ । నిరుపమసుందరినీలకుంతలవేణీ ॥ యే॥౫॥శరణిలోచెంచురామదాసునిబ్రోవవమ్మా । వరముప్రసాదించువామదేవునికొమ్మా॥ యే॥౬॥

నాదరామక్రియరాగము-అటతాళము.

నాదరామక్రియసహితా। జగన్నాయకీమహాదహంకారాదిరహితా ॥నాద॥ ౧ ॥ సృష్టిస్థితిప్రళయలీలా । నిత్యతత్వాత్మరూపిణిగిరిరాజ

బాలా ॥నాద॥౨ ॥ పంచాగ్నివేంకటమూర్తిభూతపంచకసాక్షిణి శ్రీచక్రవర్తి ॥నాద॥ ౩ ॥చెంచురామవినుతకీర్తి। మహాచంద్రకళాధరి జ్ఞానవిస్ఫూర్తి ॥ నాదరామ ॥ ౪ ॥

తోడిరాగం-ఆదితాళం

శ్రీ రాజరాజేశ్వరి । శివసతిమధుమతిసదామాంపాహిదేవి।సోరాగ్నిసోమమండలవాసిని । శృంగారాదినవరసగుణసాంద్రేసురవరముఖ శుభకరి ॥శ్రీ ॥ బాలేశుకనినదమృదువచనజాలె । త్రిభువనజననవిలయలీలే । విలసితమృగమదరుచిఫాలే । శిందూరదుకూలేనీలలోహితప్రియాంకరశీలే । నిఖిలనిగమనుతకీర్తివిశాలే ॥శ్రీ॥ ౨ ॥ కాళీపటుతరకదనసదనకేళీ। పరిభృతనిఖిలభువనపాళి । నిగమసరసినిలయమరాళి । లలనాజనమౌళి । కాళరాత్రి శ్రీదక్షిణకాళీ । కనకకుంభసుపయోధరయుగళే॥శ్రీ॥౩॥ గౌరిహిమకుధరవరనిజసుకుమారి । విబుధసవనభవనవిహారి । దురితఫణిగణజయమయూరీ । కామాదివిదారి । వీరలక్ష్మి శ్రీవేంకటసూరి । విమలహృదయసరసీరుహభ్రమరీ ॥శ్రీ॥ ౪ ॥

సావేరిరాగము-ఆదితాళము.

హిమగిరినందనావినుతసంక్రందనా।విమలభక్తచందనా।కమలసంభవజననీకలుషసంఘాతశమనీ । సుమశరవైరిరమణీసోమాంకవేణీ॥హిమ॥ ౧ ॥ అన్నపూర్ణేశ్వరిఆనందరూపిణీనిన్నునమ్మితినమ్మా।నీలంపుబొమ్మాపన్నగారిగమనాదైత్యదమనాసురేశ్వరసన్నుతాంగినీసౌమ్యవిగ్రహము।కన్నులకెదుటనుగనుపరచవేశ్రీ॥ హిమ॥౨॥ శుద్ధవిద్యాంబానీసుప్రసాదంబుకోరకు । బుద్ధినీయెంచెనిల్పిపూజలుసల్పి।శుద్ధయోగగతితో ।ధైర్యమతితో నుతించెద । శుద్ధలక్ష్మినుశిద్ధునిజేయుము । వద్దుకోపమికవారిజలోచని ॥ హిమగిరి॥ ౩ ॥ ద్వాదశాధారాంబనీతనయుడనాకుజ్ఞాన । వాదముతెల్పరాదా । వచియించరాదా । భేదమేలనమ్మా । శుభములిమ్మామహేశ్వరి।కాదిపంచదశీఘనమంత్రేశ్వరి । నేనురాత్ముడనునేరములెంచకు ॥ హిమగిరి॥ ౪ ॥పంచాగ్నివేంకటపరమగురురూపిణి । పంచబాణధారిణీపరమాధారవాణి । కాంచనాద్రిసదనాచంద్రవదనా ।సుఖంకరి। చెంచురామకవిసద్గుణదాయిని । పంచకోశమయప్రకృతివిలాసిని ॥ హిమగిరి ॥౫॥

యిందుస్తానిబ్యాకురాగము - ఆదితాళము.

వామదేవి నీనామమహత్మ్యము। వర్ణించుటకునాతరమా । వ్యో

మకేశునేత్రాగ్నిని గాలిన । కాముని ప్రాణముసృష్టించి । కోమలాంగియౌ రతికిసుమంగళ। నామమొసగిపాలించితివి ॥ వా ॥ ౧ ॥ వీరమోహినీరూపమునైకొని । విశ్వమూర్తి వైరాజిల్లి । నారాయణభూతేశవిధాతల। నటనలుపెంపొందించితివి ॥ వా ॥ ౨ ॥ చంద్రసూర్యశుచిలోచనములచేశరభకాళివై । యీశ్వరివై । ఇంద్రలోకశాత్రవుడగుమహిషుని । విపులబాణమునద్రుంచితివి ॥ వా ॥ ౩ ॥ విష్ణుకర్ణయుగళంబునబుట్టిన । వీరులైనమధుకైటభులన్ । విష్ణుమాయవైవిభ్రమమొందగ । విపులశూలమునద్రుంచితివి ॥ వా ॥ ౪ ॥ జంభశాసనాదులుముదమొందగ । శంఖచక్రశరధారిణివై । శుంభనిశుంభులుమొదలగుదానవ । శూరులసంహరించితివి ॥ వా ॥ ౫ ॥ పంచాగ్నులవేంకటరూపిణివై । భక్తగణములకుజీవనమై । చెంచురామకవినామమొసంగియు । జగతిలోననను బెంచితివి ॥ వామదేవినీనామమహాత్మ్యము ॥

దర్బారురాగము-అటతాళము.

దర్బారులోనిలిచి శేవించితిగాకీనీదర్బారులోనిలిచి శేవించితి। దుర్భరమైననాదోసములనుచాపి। నిర్భయముగనన్నునిలుపెదవనచునీ ॥ ద ॥ ౧ ॥ గర్భనరకములెన్నోగడిచియుంటినియింక। దుర్భవమొందేటిదోవవలదమ్మనీ ॥ ద ॥ ౨ ॥ అర్భకుడనునన్ను నాదరింపవెకమల । గర్భజననిమహాకాళీకౌమారిని ॥ ద ॥ ౩ ॥ దుర్బోధలన్నియుదొలగజేయుమునాకు । గర్భాతురుండనుగానుశార్వాణినే ॥ ద ॥ ౪ ॥ భూభువాదినిఖిలభువనసంరక్షణీ। దౌర్భాగ్యశమనినీదాసుడనైననీ॥ ద ॥ ౫ ॥ విభావమొందిశ్రీవేంకటగురునాథు। గర్భాబ్ధిసోముని గానవతరించినీ ॥ దర్బారు ॥ ౬ ॥

భైరవిరాగము - అటతాళము.

భైరవీరాగరాగద్వేషక్రోధకామాది । వైరినికరశమనీ । భారతీశ్రీపరాప్రాసాదరూపిణి । ధీరవితరణాదిదివ్యగుణశ్రేణీ ॥ భై ॥ ౧ ॥ చండాంశుశతకోటిస్వప్రకాశినికపట । భండాసురప్రాణభంజనికామాక్షి ॥ భై ॥ ౨ ॥ భ్రామరికౌమారిబ్రహ్మవిజీవని । కామకోటీశ్వరి కల్యాణదాయినీ ॥ భై ॥ ౩ ॥ పంచాగ్నివేంకటపరమార్యరూపిణి । చెంచురామకవి సంతోషకారిణి ॥ భైరవి ॥ ౪ ॥

శ్రీరాగము - రూపకతాళము.

శ్రీరాగమునతతంబును । శోధించగనేయవే ॥ శ్రీ ॥ నారాయణి

దాక్షాయణినగేంద్రతనయాగౌరి ॥ శ్రీ ॥ మనంబుననుదినంబునినుగనంగ వలెననినీ । ఘనతారకలక్ష్యార్థమును । ననిశంబునుబూనియుమానసముతో నిన్నుభజయించెద ॥ శ్రీ ॥ ౧ ॥ హరీశ్వరులువిరించియునుసురల్నినుగనిమహా । పరమార్థమగురుతెరిగిరి । పరమేశ్వరిశాంకరిశ్రీకరికాత్యాయని స్త్రీమణి ॥ శ్రీ ॥ ౨ ॥ గణేశ్వరివిఘ్నేశ్వరివిఫణీధరనిజసతి । ఫణితల్పునిసోదరివని । బహుభంగులనీచరితంబులువినుతింపుచుమొక్కెద ॥ శ్రీ ॥ ౩ ॥ నరుండనినుస్మరించగనుతరంబెభానుమతీ - పరమేశ్వరుడగువేంకట । గురురూపముతోకరుణించుచుదేవీకుళయోగిని ॥ శ్రీరాగము ॥ ౪ ॥

శ్రీరంజనీరాగము-ఆదితాళము.

శ్రీరంజనీకళాధారిణీచిన్మయీరమణీ ॥ శ్రీ ॥ సారసాక్షీగిరివరసుకుమారీసాధ్వీమణిగౌరీ ॥ శ్రీ ॥ ౧ ॥ గోత్రరాజసదనాశారదకుముదవిహితవదనా । నీవరపుత్రుడంచునన్నుజూడవమ్మా । పోషించవమ్మా ॥ శ్రీ ॥ ౨ ॥ శూలచక్రపాణీమంజులశుకనినాదవాణీభగవతి । ఫాలనేత్రనాట్యరంగశీలా । బ్రహ్మాణ్యలీలా ॥ శ్రీ ॥ ౩ ॥ చెంచురామకవిని । శిష్యునిజేశిబ్రోవుజననీమదవతి । పంచవహ్నివేంకటార్యరూపా । ప్రజ్ఞానకలాపా ॥ శ్రీరంజనీకళాధారిణీ ॥ ౪ ॥

ఖరహరప్రియరాగము- త్రిపుటతాళము.

ఖరహరప్రియరాణీశుకకోకిలవాణీ । కాలాగ్నిశరపాణీ।వోదేవి॥ ఖ ॥ గిరిరాజనందనాసురమానిచందనా । దురితవిఖండనా । తురీయానందాసునిధానా ॥ ఖ ॥ ౧ ॥ జననీశరణజలజమునమ్మితి । మనమందునింతైనమర్యాదలేదా । వనజాక్షీమహాదేవీవరదాభయపాణీ । నెనరుంచిబ్రోవవే నీలకుంతలవేణీ॥ ఖ ॥ ౨ ॥ పరమకల్యాణినీభక్తుడనైయున్నాను । వరమిచ్చి నీనామస్మరణనెప్పుడుమరువకుండగజేశినన్ను । మాన్యునిజేయవె । నరుడనుదీనుడనన్నుచల్లగజూడు ॥ ఖ ॥ ౩ ॥హరిణాక్షీభారతి । అరవిందసంభవమురహరరూపిణి । పరమేశ్వరి గౌరిస్మరసంజీవనకారి । అరమరేలనే । దురితముదొలగించుదోషాటవిదళనా ॥ ఖ ॥ ౪ ॥ పంచాగ్నివేంకటపరమార్యరూపిణి । వంచింపగనేలనేవనదుర్గిశాంభవీ । చెంచురామదాసునిసంతోషమొందించు । పంచకోశవిలక్షణీబాలామానితశీలా ॥ ఖరహరప్రియరాణి ॥ ౫ ॥

## బలహంసరాగము-యేకతాళము.

బలహంసగమనవిజయగామిని । భానుచంద్రవైశ్వానరలోచనీ। చలముయేలనాపైవరములీయవే । చక్రరాజబిందుమధ్యనివాసినీ॥బల॥ ౧ ॥లలితమాణిక్యసౌభాగ్యభూషణి।లక్ష్యలక్షణవిలక్షణరూపిణీ।కలుషపూర్వదేవగణవినాశనీ।కామకోటికళాసూత్రధారిణిశ్రీ ॥బల ॥ ౨ ॥ ఆదిశక్తిపరంజ్యోతిరూపిణి । ఆదిబీజామృతధారావర్షిణి । నాదబిందుకళామయశరీరిణీనన్నుగన్నతల్లిపుత్రకామేశ్వరీ॥బల ॥ ౩ ॥పంచాగ్నులవేంకటార్యరూపిణీ । పంచబ్రహ్మపర్యంకనివాసినీ । చెంచురామదాసవంశపోషిణి। చిత్తశాంతిగలుగజేశిరక్షించవే ॥ బలహంసగమన ॥ ౪ ॥

## బ్యాగడరాగము-రూపకతాళము.

భారతినీకొలువునపంతముననేనుజేరితి ॥ భారతి ॥నేరములునెంచవలదికి । నీతనయుడనేజనని । వారిజనిభసన్ముఖివామాక్షిమన్నించు॥భారతి ॥ ౧ ॥ వరదాయినిరజితాద్రిపతినాయకిదహన । తరణేందుగగనవారిధరణివాయురూపములు । ధరియించియులోకముకెల్లనుమాయావతివైతివి । తరమానినుమానసమందుననెంచగమన్నించు ॥ భారతి ॥ ౨ ॥కమపిన్నతనమునుంచినినునమ్మితి । యితరజడదైవనికరమందుమతియులేమనేటికిని।యెడలెప్పుడునుండగశాశ్వతమానా।జగదీశ్వరివిడనాడకనాకడకిప్పుడువచ్చియురక్షించు॥భారతి॥ ౩ ॥మనసేంద్రియములుప్రాణములుదేహముధనము । నిజగేహముబ్రవతశీలముఘనభోగభాగ్యములు । అనిశంబునునీయెడనిల్పితి । దేవియిదిసత్యము । అనుమానముమానియువేగమెరక్షించు ॥భారతి ॥ ౪ ॥ శరణాగతజనపాలనసుమంగళవిమల । బిరుదాంకముగలతల్లివనుచునిన్నువేడితిని । మునుభక్తులనెల్లనుబ్రోచినలీలల్గనియుంటిని । పరమేవరమేనని మొక్కితినన్నికరక్షించు ॥భారతి॥ ౫ ॥ముదమొప్పగవరవేంకటవిబుధేశ్వరునివలెను । సదయారసమునననన్నుసెప్పుడులోకముననూ । పదిలంబుగజ్ఞానముయోగము । బోధించితివీశ్వరి। యిదిమాపదమాయనిసంతసమొందితిగ మన్నించు ॥ భారతి ॥ ౬ ॥ లలితాంగిచెంచురామకవిపోషిణి । రమణీ । కలకాలమునసునీదుస్మరణమానకుండగనూ । విలసిల్లగజేయుముగోత్రతమూలీభువనేశ్వరి । కలలోకములోనినుబోలినదైవములేదని ॥ భారతి ॥ ౭॥

## మారువరాగము - ఆదితాళము.

కామాక్షీభవానీశార్వాణీకల్యాణీదేవీ । కామస్వరూపిణికామేశ్వరిగౌరీ । కోమలశరీరిణికాళినికౌమారిరమణి ॥ కామాక్షి ॥ ౧ ॥ నారదాదిమౌనినాథులబ్రోచిన। శారదాకాళీనారాయణిశ్రీంకారీభాగ్యవతిసూరిజనావని । చారుచంద్రవదనా । దేవిసకలవేదసదనా । శ్రీకణి । ఘోరదురితసంహారిణిమధురిపు । సారసభవశివసాధనకారిణిజనని ॥ కామాక్షి॥ ౨ ॥ పంచభూతేశ్వరిపావనచరితా । కాంచనాంబరిశ్రీకామేశతరుణీ।పంచబ్రహ్మాసనిపంచయజ్ఞేశ్వరిపంచబాణపాణీదేవీపరమసత్యవాణీభగవతి । పంచవహ్ని వేంకటగురురూపిణి । చెంచురామదాసునిరక్షించవెజనని ॥ కామాక్షి॥ ౩ ॥

## అసావేరిరాగము - అటటతాళము.

యోగజ్ఞానసిద్ధింకురుమేవాణి । యోగినీగణపరివృతేకుళయోగమార్గనివాసినీ ॥యోగ ॥ ౧ ॥స్మరరథాంగసమానసుశ్రోణి। పరమతారకరాజయోగవిలాసినినారాయణి ॥ యోగ ॥ ౨ ॥ కరుణారసపూరితజలజనయనే । పరమపావనతీర్థచరణేపార్వతిగిరినందనే ॥ యో ॥ ౩ ॥ పంచాగ్నివేంకటగురురూపిణీ। చెంచురామకవిప్రసన్నవిలాసవిభ్రమకారిణి ॥ యోగ ॥౪॥

## కళ్యాణిరాగము - అటతాళము.

కల్యాణిగౌరీశ్రీకామేశ్వరీదేవీ । బాల్యప్రభృతినిన్నుప్రార్థించితినిదేవీ ॥ క ॥ శర్మదాయినిశంఖచక్రాదిధారిణీ । ధర్మసంవర్ధినిదాక్షాయణిదేవీ ॥ క ॥ ౨ ॥ కలహంసగామినికమలదళలోచని । బలముశిరియుసంప్రాప్తముజేయుపరదేవీ ॥ క ॥ ౩ ॥ ఆయురారోగ్యమహదైశ్వర్యకారిణీ । మాయాలీలావతిమదనసంజీవనీ ॥ క ॥ ౪ ॥ రాకానిశాకరరమణీయముఖబింబా । పాకారిముఖసురప్రకటగుణనికురుంబా ॥ క ॥ ౫ ॥ జంభారికరికుంభసదృశపయోధరి । శంభుప్రియంకరిజలజాక్షుసోదరీ ॥ క ॥ ౬ ॥ పరమపావనతీర్థపాదపద్మయుగళా । పరమేశ్వరీజగత్ప్రాణేశ్వరీబగళా ॥ క ॥ ౭ ॥ సర్వాపసవ్యసంస్కారవిధాయినీ । దివ్యమంగళచరితాదీనసంరక్షణీ ॥ క ॥ ౮ ॥ పంచాగ్నివేంకటపరమగురురూపిణి । చెంచురామకవిచిత్తాబ్జవినమణీ ॥ కల్యాణి ॥ ౯

యిందుస్తాని-ముఖారి రాం-ఆదితాళము.
శ్రీదేవీనామమాహాత్మ్యము.

శ్రీదేవీనామామృతమూగోల్రిలవేమనసా। శ్రీకరమైనయోగమూ ॥ నాదబిందుకళాతీతమైనట్టిపదము।వేదవేదాంగసారమూ।విశ్వంభరమూ॥ శ్రీ ॥ ౧ ॥ బ్రహ్మవిష్ణుశివేంద్రాదిసంజీవనము । బ్రహ్మజ్ఞాననిధానమూ।పరమార్థరసము । శ్రీ ॥౨॥ ఆయురారోగ్యసౌభాగ్యప్రదకారణము । ఆనందపారావారమూ । అప్రమాణమూ॥ శ్రీ ॥ ౩ ॥సాధనచతుష్టయసంపదగలిగిన । సాధుజనులభోగమూ । సార్వకాలమూ ॥శ్రీ॥ ౪ ॥ సర్వవ్యాపకముసత్యముశుద్ధము। నిర్వికారముపరమూనిర్వాణపదము ॥ శ్రీ ॥ ౫ ॥ శివశక్తిమయమైనచిన్మయస్వరూపము । భవభయనివారణమూ । పరమపావనమూ ॥ శ్రీ ॥ ౬ ॥ జననమరణాదిదుఃఖ-జలధిబడబానలము । అనిమిషలోకాధారము । అప్రమేయము ॥ శ్రీ ॥ ౭ ॥ దహరాకాశాంతస్థతారకదీపము । మహదహంకారసహితమూ । మంగళప్రదము ॥ శ్రీ ॥ ౮ ॥ యిరుకమరపులనైరిగేయిరుకకుమూలము । నిరుపమదివ్యతేజమూ । నిర్విశేషము ॥ శ్రీ ॥ ౯ ॥ సప్తకోటిమంత్రసాధనకారణము । సప్తాశ్వకోటిభాసురమూ । సామ్రాజ్యకరమూ ॥ శ్రీ ॥ ౧౦ ॥ భూమిసలిలాదిపంచభూతవిలక్షణము । కామక్రోధాదిరహితమూ । కైవల్యప్రదమూ ॥ శ్రీ ॥ ౧౧ ॥ లక్ష్మీవాణీగౌరీలక్షణరూపము సూక్ష్మాతిసూక్ష్మభావము । సౌఖ్యకరము ॥ శ్రీ ॥ ౧౨ ॥ నారదాదిమౌనినాయకులకుఘనసం।సారాబ్ధిచంద్రోదయము । సజ్జనధనము ॥ శ్రీ ॥ ౧౩ ॥ పరమసుషుమ్నానాడీప్రాణగణసంధానము । దురితారణ్యకుఠారము । తుర్యాతీతము ॥ శ్రీ ॥ ౧౪ ॥ త్రివిధలక్ష్యములకుదివ్యప్రభాకరము । భువనమోహనకరము । భుక్తిదాయకము ॥ శ్రీ ॥ ౧౫ ॥ అమరవరేణ్యులకునాదిబీజామృతము । విమలము సనాతనము । విద్యాసాధనము ॥ శ్రీ ॥ ౧౬ ॥ప్రకృతిపూరుషమయమూ ॥ ప్రణవనాదామృతమూ ।సుకృతజగత్ప్రవాహమూ । శుద్ధచేతనమూ॥ శ్రీ । ౧౭ । అగణితభాసురముయాద్యంతరహితము । నిగమనిగమాంతాగోచరము । నిష్ప్రపంచము ॥ శ్రీ ॥ ౧౮ ॥ నానాలోకములకునాయకీరత్నము। ఆనందయోగసూత్రము । ఆశ్చర్యరసము ॥ శ్రీ ॥ ౧౯ ॥ పంచాశద్వర్ణములకుప్రాణసంధాయకము । పంచబ్రహ్మవిలాసము । పరాత్పరము ॥ శ్రీ ॥ ౨౦ ॥ తత్త్వమస్యాదిలక్ష్యార్థప్రసన్నయోగము । సత్త్వాదిగుణమూ

న్యము । సాక్షిరూపము ॥ శ్రీ ॥ ౨౧ ॥ సోమసూర్యాగ్నితేజోసూత్రము గోప్యముసామానాధికరహితము । సర్వాంతర్గతము ॥ శ్రీ ॥ ౨౨ ॥ ప్రకటపరాపరప్రకృతులకాధేయము । మకరాంకదివ్యౌషధము । మాధుర్యతరము ॥ శ్రీ ॥ ౨౩ ॥ దారిద్ర్యవిదారణముధర్మసంవర్ధనము । తారకయోగాంజనము । తత్పదార్థము ॥ శ్రీ ॥ ౨౪ ॥ విమలసహస్రారకమలజమకరందము । సమరసానందకరము । స్వాత్మానందము ॥ శ్రీ ॥ ౨౫॥ జగదధిష్ఠానముశాశ్వతజ్ఞానము । సగుణనిర్గుణరూపము । సద్యోజాతము॥ శ్రీ ॥ ౨౬ ॥ అష్టాంగయోగులకునమృతశిద్ధియోగము । ద్రష్టదర్శనదృశ్యము । ధారణామతము ॥ శ్రీ ॥ ౨౭ ॥ సంతతానాహతసరసధారావర్షము । అంతరింద్రియలక్ష్యము । అతులవైభవము ॥ శ్రీ ॥ ౨౮ ॥ శ్రీచక్రబిందుమధ్యచిత్కళాదీపము । వైచిత్ర్యస్వప్రకాశము । వైఖరీనాదము ॥ శ్రీ ॥ ౨౯ ॥ అండత్రయములోననంటకవెలిగేటి । పండువెన్నెలతేజము । బ్రహ్మానందము ॥ శ్రీ ॥ ౩౦ ॥ ఆదిశేషునినిదురబోధజేశేటిమహా మోదినీదేవీకాయము । మోహనకరము ॥ శ్రీ ॥ ౩౧ ॥ కర్మయోగములచేకానరానిభావము । దుర్మార్గులకుదూరము । దుర్లభముఘనము॥ శ్రీ ॥ ౩౨ ॥ ఆశాపాశంబులనుగోశివేశినపరమ । దేశికులకుసౌఖ్యము । యోషునివ్రతము ॥ శ్రీ ॥ ౩౩ ॥ నిర్మలాకాశమునిత్యనిరంజనము । ధర్మాధర్మాదిశూన్యము । దాంతులతపము ॥ శ్రీ ॥ ౩౪ ॥ నానాయోగీంద్రులకుమానముగల్గించేటి । జ్ఞానముపెన్నిధానము । మాననీయము ॥ శ్రీ ॥ ౩౫ ॥ మేరుపర్వతమందుజేరిధ్యానించేటి । ధీరమతులకుయోగ్యము । ధీవిలక్షణము॥ శ్రీ ॥ ౩౬ ॥ సర్గస్థితివిలయసాధనకారణము । స్వర్గాదిలోకశుభదము । స్వరమండలము ॥ శ్రీ ॥ ౩౭ ॥ శ్రీయునుబలమునుశ్రేయముగలిగించేటి । మాయారూపవిలాసము । మహామంత్రము ॥ శ్రీ ॥ ౩౮ ॥ గంగాదినదులను మింగినఘాతముసంగరహితభోగము । లింగాంగమయము ॥ శ్రీ ॥ ౩౯ ॥ జీవబ్రహ్మైక్యజ్ఞానశిద్ధిగల్గించేటి । దేవదేవీస్వరూపము । తీవ్రమోక్షము॥ శ్రీ ॥ ౪౦ ॥ లక్ష్యార్థవాచ్యార్థలక్షణాగోచరము । అక్షీణస్వప్రకాశము । ఆర్యులమతము ॥ శ్రీ ॥ ౪౧ ॥ మహామాయామయమందిరదీపము । దేహత్రయనిధానము । దేశాంతరము ॥ శ్రీ ॥ ౪౨ ॥ బంధత్రయాతీతభాసురవిగ్రహము । అంధకారవిరహితము । అతీంద్రియము ॥ శ్రీ ॥ ౪౩ ॥ నవవిధసంస్కారవైభవములకుసదా । శివశక్తిసందర్శనము । చిన్మయసా

రము ॥శ్రీ॥౪౪॥ఆకాశాతీతముఅచలముపరిపూర్ణము । లోకాలోకవ్యాపకము । లోకాస్పదము ॥ శ్రీ ॥ ౪౫ ॥ వాసనత్రయమునువదలినబుధులకు । శ్రీసదాశివరూపము । స్థిరమైనధనము ॥ శ్రీ ॥ ౪౬ ॥ పంచమకారములకుప్రాణకరణముమహా । పంచకూటవిశేషము । పరమార్థప్రదము ॥ శ్రీ ॥ ౪౭ ॥ వెల్లులనన్నిటనెనసివెల్లుచునున్న । నాల్గువేదములసారము । నాదామృతము ॥ శ్రీ ॥ ౪౮ ॥ వైరాగ్యబోధలకునుపరతిసాధనము । ధీరులకెల్లమోదము । దివ్యాంబరము ॥ శ్రీ ॥ ౪౯ ॥భూతప్రేతాదిభయసంఘాతనివారణము । శీతాంశుమండలస్థము । శిద్ధయోగము ॥ శ్రీ ॥ ౫౦ ॥ బ్రహ్మహత్యాదిమహాపాపవిమోచనము । బ్రహ్మాండజాలాధారము।ప్రాధానికము ॥ శ్రీ ॥ ౫౧ ॥ పంచాగ్నివేంకటపరమగురురూపము । పంచదశిమంత్రార్థము । ప్రకృతిలక్షణము ॥ శ్రీ ॥ ౫౨ ॥ జగతిలోవెల్లాలచెంచురామునిమతము । సగుణనిర్గుణాధారము । శాశ్వితపదము । శ్రీదేవీనామామృతము ॥ ౫౩ ॥

మంగళార్తి-సురటరాగం అటతాళం.

జయమంగళమూ । హైమవతికీసంతతవైభవమూ । గౌరికినిత్య॥ జయమంగళము । మహోత్సవమూసంతతసామ్రాజ్యమూ । భయము లెల్లనుదీర్చిబ్రోచెటి । పార్వతికిత్రిపురాంబదేవికి ॥ జయ ॥ ౧ ॥ యోగనిద్రాపరవశుడైహరిజలములో । భోగిపైపవళించగా । మధుకైటభులు బ్రహ్మనుయెదిరించగా । విజృంభించి । యోగమాయామహిమచేతను । విష్ణురూపముదాల్చివారల । వేగమునమడిముంపజేశిన । వేదజననికికాళికాంబకు॥ జయ ॥ ౨ ॥ దురితాత్ముడగుమహిషాసురుడుసక్రోధుడైసురవరుల బాధించగా । మునివాధులబొరిగొనిచరియింపగా । భయదాకృతియై । దురమునసుదనుజేంద్రుకంఠము । దునిమియమరులువిరులుగురియగ । సురవరేణ్యునిదేవపురమున । స్థిరముగనునిల్పినపరాంబకు ॥ జయ ॥ ౩ ॥ త్రైలోక్యయజ్ఞభాగంబులుహరియించి । త్రిజగముల్క్షోభించగా । శుంభనిశుంభుల్ వ్రాలుచుదీపించగా । కామాక్షియై । ఏలచేధూమ్రాక్షుడాదిగకాలరౌద్రనిశాచరులశర । జాలములుగురియించివారలసంహరించినదేవదేవికి ॥ జయ॥౪ ॥ పంచాగ్నివేంకటపరమగురురూపిణియై । భక్తులపాలింపుచు । విజ్ఞానముమించగాకరుణింపుచూ । నిరంతరము । చెంచురామకవీంద్రువంశముస్థిరముగావర్థిల్లజేయుచు । వాంఛితార్థములెల్లనొసగి

నవామదేవికిలోకజననికి ॥జయమంగళము ॥౫॥

ముఖారిరాగము-జంపెతాళము.

పరమార్థరూపిణికి । ఫాలలోచనసతికి ।కరుణాంబురాశికినికా మాక్షికి । శరభకాళికినిరతసత్యవాగ్వాదినికి । పరమేశ్వరికిపరాపరప్రకృతికి ॥ జయమంగళంసదాశుభమంగళం ॥ ౧ ॥ గిరికుమారికిమహాక్లీంకార పంజరాం । తరవాసినికిమదానురదమనికీ । స్మరజీవనికిసురాసురలోక మోహినికి । శరజన్మజననికిశర్వాణికి ॥ జయ॥ ౨ ॥ పంచాగ్నివేంకటపర మార్యరూపిణికి । సరసిజాండోదరికిసగుణాంబకు । చెంచురామకవీంద్ర చిత్సౌఖ్యదాయికినిపంచకూటేశ్వరికిభానుమతికి ॥జయమంగళం॥ ౩ ॥

సురటరాగము-అటతాళము.

తనరాజసముచేతదనరంగనేదేవి । ఘనముగభువనముల్ గల్పించి మించి । వనజభవాధులకువర్ణింపరానట్టి । దినకరశశినేత్రమైనభారతికి॥ మంగళంమంగళం ॥ ౧ ॥ తనసాత్వికముచేతదగనేమహాలక్ష్మి । వనరుగజ గములవర్ధిల్లజేశి । సనకసనందనసన్మునిముఖులకు । మనుయోగములుదె ల్పినట్టిశాంకరికి ॥ మంగళం ॥౨॥ తనతామసముచేత । దనరియేపరదేవి। యనలాక్షియైసర్వజగములనణచి । ఘనమాయాలీలచేగగనస్వరూపమై। ప్రణవమైవిలసిల్లినట్టిపార్వతికి॥మంగళం ॥౩॥ పంచాగ్నివేంకటపరమగురు రూపమై ।మించియేకళ్యాణిమేదినియెందూ । చెంచురామకవికిచిత్తశాం తియొసనుపాం । డించిమెరశినట్టిదాక్షాయణికిని ॥ మంగళంమంగళం ॥ ౪॥

దేశముఖభైరవిరాగము-రూపకతాళము.

మంగళముదేవదేవికిత్రిపురాంబదేవికి ॥ మం ॥ అంగజవైరినాయ కికిఅంబుజదళలోచనికి । భృంగరాజవేణికిమునిపుంగవగణపోషిణికి ॥మం॥ ౧ ॥ వేదజననికిప్రణవరూపికి । విష్ణుమాయావిలాసినికి । ఆదిదేవికిసౌభా గ్యవిద్యకు । నఖిలలోకమోహినికిజయ ॥ మం ॥ ౨ ॥ శాకినిరూపధారి ణికినిశాచరసంహారిణికి । కోకిలమృదువాణికిబుధలోకసంచారిణికినిజయ॥ మం ॥ ౩ ॥బిందుమండలవాసినికిబిందుసర్వానందమయచక్రికి । ఇందువదనకు గౌరికినాదబిందుకళాతీతరూపికి ॥ మం ॥ ౪ ॥హ్రీంకారికిపరమేశ్వరికిని హ్రీంమతికినిభగవతికి । క్లీంకారికికోమలాంగికి ॥ గిరికుమారికిరాజ్యలక్ష్మి కి ॥ మం ॥౫॥ పంచాగ్నులవేంకటార్యరూపికిపరమరాజయోగినికి । చెం చురామదాసహృదయజలరుహభాస్కరికినిత్య ॥మంగళము॥

ఆనందభైరవీరాగము-ఆదితాళము.

లాలిశ్రీనారాయణీపరదేవిలాలిశ్రీదాక్షాయణీ । లాలివేదపరాయణీకామాక్షిలాలిశ్రీకాత్యాయనీ ॥౧॥ సకలలోకవిమోహినీభగవతీ । సర్వపాపవిమోచనీసకలరోగనివారిణీమధుమతీసర్వసంపత్కారిణీ ॥లా॥ ౨॥ రాజమాతంగేశ్వరీమదవతీరాజయోగసుధాకరీరాజరాజశుభంకరీశివసతీరాజ్యలక్ష్మీశ్రీకరీ ॥లాలి॥ ౩॥ మీనకేతనజీవనీయోగినీమీనాక్షిగజగామినీ।జ్ఞానయోగవిధాయినీవసుమతీమానవేశ్వరికౌళినీ॥లాలి॥౪॥శ్రీచక్రబిందుసదనాభారతీశీతాంశువిజయవదనా।ఖేచరీదైత్యసుదనా। నిజభక్తకైవల్యపదసాధనా॥లాలి॥౫కామకేళితరంగిణీరంజనీ-కామారిసుశరీరిణీ। సామరస్యపరాయణి।నవరత్నసౌవర్ణమయభూషణీ॥లాలి॥౬॥నకకుంభపయోధరీవారుణీ । కామకోటీసుందరీ । మనుమతీమునిసుఖకరీ। సోషుమ్నామండలాంతరభాస్కరీ॥ లాలి ॥౭॥ పంచకోశవిలక్షణీపార్వతీబ్రహ్మాండగణధారిణీపంచమీగుణసాక్షిణివెల్లాలచెంచురామసుపోషిణీ॥ లాలి॥ ౮ ॥ వేంకటార్యస్వరూపిణీ । చక్రిణీవిమలసరసిజలోచనీ । శంఖచక్రధారిణీకళ్యాణిశాంకరీమధుసూదనీ॥ లాలి ॥ ౯ ॥

శంకరాభరణరాగము.అటతాళము.

లాలిశ్రీపరమేశ్వరీమహాకాళీ । లాలినాషుమ్నఘనకాసార కేళీ లాలి ॥ ౧ ॥ రాజయోగసుధాబ్ధివరచంద్రబింబా రాజరాజేశ్వరీసుగుణనికురుంబా। రాజరాజవిమోహకరశారదాంబా । రమణీయగజకుంభసదృశకుచకుంభా ॥ లాలి ॥ ౨ ॥ సోమశేఖరునియర్ధాంగముధరించి । సోమసూర్యాగ్నినేత్రములుధరియించికామకేళితరంగములచేమించి। భూమిసలిలాములనుబుట్టించినావు ॥లాలి॥ ౩॥రమణీయరూపుడగుమరునిబ్రతికించి । రతికిసన్మాంగల్యమునుప్రసాదించి । సమరమందునమహిషదైత్యునివధించి । సకలదేవతలనురక్షించినావూ॥ లాలి ॥౪॥ వామదేవునినాట్యమునుసంతసించి । వైఖరీపీఠమధ్యమునవసియించి । సామరస్యమనంబుననిశ్చయించి । సత్యాంబుధర్మంబుదగసిల్పినావూ॥ లాలి॥ ౫ ॥ శుంభాదిపూర్వదేవతలమడియించిసూర్యచంద్రాదులకుదీప్తులువిధించి । దంభోళిధరునిస్వర్గమునపొందించి । ధైర్యశౌర్యములెసగరాజిల్లినావూ ॥లాలి॥ ౬ ॥ లీలచేతనుమహామాయనుధరించి । ఫాలలోచనముఖులబట్టిసూడించి । కాలదేశంబులనుదెలియరచియించి । కాలసంకర్షణాకృతిదాల్చినావూ॥లా॥

౭|| సంగీతభారతీదేవివైమించి । సన్మానులకుజ్ఞానపత్రికలిఖించి । మాంగల్యమూర్తివైప్రకాశించి। మండలత్రయవిలక్షణమొందినావూ||లాలి||౮|| చక్రశంఖాదిదివ్యాస్త్రములుధరించి । చక్రరాజన్యబిందువునుసవరించి । అక్కారులైనభక్తులనుమన్నించి । ఆనందమూర్తివైవిలసిల్లినావూ ||లాలి|| ౯|| సప్తకోటిసుమంత్రములనుబుట్టించి । గుప్తమైనట్టియోగమునుసంధించిసప్తాశ్వకోటిభాసత్వమువహించి । సుప్తిజాగత్స్వప్నములమించినావూ || లాలి || ౧౦ || పంచభూతంబులకుపాదులువిధించి । పంచకోశంబులనుభువినిపొందించి । పంచయజ్ఞంబులకుఫలములలరించి । పంచాగ్నివేంకటాకృతిదాల్చినావూ || లాలి ||౧౧|| వెల్లాలచెంచురాముని గారవించి చల్లగావీక్షించిశుభమునొందించి । తల్లివైసార్వకాలమునురక్షించియెల్ల లోకములకునెరిగించినావూ || లాలి ||౧౨|| నిన్నువర్ణనజేయశక్తుడనుగానూ । నిన్నుసందర్శింపనిత్యుడనూగానూ । నిన్నుపూజించుటకునేఘనునిగానూ । నన్నుపాలించవేశ్రీమహాలక్ష్మీ|| లాలి ||౧౩||

## ముక్తికాంతాదేవి-మంగళహారతి.

## సురటరాగము-యేకతాళము.

శ్రీమత్పంచదశాక్షరిమంత్రము ।శిద్ధినిబొందించి । సోమునిసూర్యునొకటిగజేశెటి । సూత్రమునెరిగించి । కాముని రాముని గర్భములోపల। గదలకకుండగనునిల్పిభరించిన । కామాక్షీదేవికినిత్యమంగళం । కల్యాణభారతికిజయమంగళం || ౧ || సరసరజస్వలధరలోగలిగిన । సారముదాప్రవించి । స్వరసాహిత్యహితంబగుగీతావాద్యమువినిపించి।సురమానవులకుజూపనిరూపము ।చూపులోపలనుజూపించినశ్రీ । శుభ్రాంశుముఖికినిత్యజయమంగళం । సౌందర్యలహరికిశుభమంగళం || ౨ || మునిజనంబులునుమణిగినతావున । మురిపెమునొందించి । తనమూర్తినికడుధారబోశినిజధర్మముసాటించి । ఘనసుషుమ్నారంధ్రంబున నెప్పుడు।మనసునిల్పుమనిమరిమరిదెల్పిన ।మాహేశ్వరీదేవికిజయమంగళం।మణివీణాధారిణికిశుభమంగళం || ౩ || అమృతసేవనముదృఢతరమనిజీవాత్మకుబోధించి । అమృతముజగములకాధారంబనియపుదేవర్షించి । అమృతముప్రాకృతజనులకువిషమని। అతిచోద్యంబనిసంభాషించిన । అమృతేశ్వరికినిత్యజయమంగళం। ఆనందరూపిణికిశుభమంగళం || ౪ || పండువలనసౌభాగ్యకరంబని।బ్రహ్మనుబుట్టించి । పండువలననానందసుఖంబనిభవునిబుట్టించి । పండుకాశపడి

బ్రతుకుమటంచును । పుండరీకాక్షునిబుట్టించినశ్రీ । భూతేశ్వరికినిత్యజయ
మంగళం । భూమ్యాదిజననికిశుభమంగళం ॥ ౫ ॥తంత్రపుమాటలుమరచి
నదనుకా । మంత్రముజొరదనుచూ । మంత్రముమరచినదనుకాబిందువును
వసునిల్వదనుచూ । భ్రాంతియుమనసునిలచిదనుకా । పరమపదంబునులేద
నితెల్పిన । పరమేశ్వరిదేవికిజయమంగళం । బ్రహ్మాండధారిణికిశుభమంగ
ళం ॥ ౬ ॥ కడుపేలేదనిసకలజగంబుల । కల్పనజేయుచునూ । కడుదేహ
ములేకుండేటిమగనితో । గదసిరమించుచునూ । దుడుకుతనంబునుగలిగిన
సుతునికి । దుఃఖమేమిలేకుండగజేశిన।తురీయాంబాదేవికిజయమంగళం ।
ధూర్జటిప్రాణేశ్వరికిశుభమంగళం ॥ ౭ ॥ చీకటిమరుగునవస్త్రముగట్టి
యు । శిగ్గువదదుగుచునూ । ప్రాకటముగవస్త్రంబువిడచియును। పగలేది
రుగుచునూ । లోకములన్నియుగెలిచినదానితో । లోలాత్ముడవైమనుమ
నీదెల్పిన। లోకవిమోహినికిజయమంగళం। లోకేశ్వరికినిత్యశుభమంగళం
౮॥ మొదటనుబోసినఅమృతరసంబునుతుదకెక్కించుకునీ,తుదబీజములను
సోకగమరలనుమొదటికితీసుకునీ । వదలకమొలకలుమొత్తగపృథ్వికి । ము
దమొదవగనెక్కించుచుమెరశిన । ముక్తికాంతామణికిజయమంగళం ।
మూలప్రకృతిరూపిణికిశుభమంగళం ॥౯॥ మొదలుజూచితుదజూడకయుం
డిన । మోక్షములేదనుచూ । కదలెటిచూపునుగలిగితేమరిశ్రీకాంతుడు
గాడనుచూ । తుదమొదలునుకెంటినిసురుతెరిగితె। వదలనిసుఖమనివక్కా
ణించిన।వామాక్షీదేవికిజయమంగళం । వాగీశ్వరికినిత్యశుభమంగళం॥౧౦
వ్రేయగవ్రేయగవిత్తనమాయెను । వేమరుజెలియుమని । వ్రేయగవ్రేయగ
బలవృక్షంబని । యిపుడేజూడుమని । మాయలసంసారమునమ్మకుమని ।
మరిమరిసంబోధించుచువెలశిన । మహామాయాదేవికిజయమంగళం। మం
గళకారిణికిశుభమంగళం ॥ ౧౧ ॥ స్థిరబిందువుశేవించినమనుజుడు । చిర
కాలాత్ముడని।వరతీర్థముశేవించినబుధుడు । వాసుదేవుడని । శరణాగ
తుడౌసాధుశేవకుడు । సర్వముతానౌనని పల్కినశ్రీసర్వసాక్షీరూపిణికిజ
యమంగళం । సామ్రాజ్యశ్రీలక్ష్మికిశుభమంగళం ॥ ౧౨ ॥ పంచబ్రహ్మాస్థా
సమర్మ్ములపరిశీలింపుమని । పంచప్రాణాతీతపదంబగుబ్రహ్మముపొందు
మని । పంచాగ్నులవేంకటగురునాథుని । పదకమలంబులగనుమని పల్కి
న ॥ పరమేశ్వరీదేవికి జయమంగళం ॥ ప్రియస్వరూపిణికిశుభమంగళం ॥
౧౩ ॥ కంటిపాపలోనెనసినపురుషునిగనుగొని మొక్కుమని । మింటినై

నలక్ష్యంబుననిల్పుచుమెరయుచునుందుమని । కంటికిమనసుకువాక్కుకు దొరకని । కారణగురునిచరిత్రముదెల్పిన । కామేశ్వరీదేవికిజయమంగళం । కమలాప్తశశినేత్రికిశుభమంగళం ॥ ౧౪ ॥ పంచకోశవ్యతిరిక్తభావమునుప ట్టుగపొందుమని। పంచభ్రాంతులువిడిచినయోగముచాగాపట్టుమని । చెంచురామకవి ననెడియహంకృతిశాంతిపరచుమనియుపదేశించిన ॥ శాకంభరీదేవికిజయమంగళం । చక్రేశ్వరికినిత్యశుభమంగళం ॥ ౧౫ ॥

సురట రాగం-అట తాళం.

శ్రీధరశంకరద్రుహిణరూపిణికి పరదేవికి । జయమంగళంశుభమంగళం।భూధరపుత్రికిపరమకల్యాణికిగౌరికి।జయమంగళంశుభమంగళం॥౧॥ సర్గస్థితిలయకారిణికిసర్వసాక్షికి । జయమంగళంశుభమంగళం ।భర్గమనోహరయోగానందసుగుణశ్రేణికి । జయమంగళంశుభమంగళం ॥౨ ॥ దివ్యమంగళసుందరాకృతికి కమలపాణికి । జయమంగళంశుభమంగళం । హవ్యవాహనసోమసూర్యనేత్రికిగిరికుమారికి । జయమంగళంశుభమంగళం ॥ ౩ ॥ సప్తకోటిమహామంత్రేశ్వరికిమహాకాళికి।జయమంగళంశుభమంగళం। సప్తాశ్వశతకోటిభాసురాంగికిసత్యవాణికి । జయమంగళంశుభమంగళం॥ ౪ ॥ నవరసాలంకారసంగీతాభారతీదేవికి । జయమంగళంశుభమంగళం। నవమణిభూషణధారిణికినీలవేణికిజయమంగళంశుభమంగళం ॥ ౫॥కూటత్రయాకృతిగలిగినశ్రీత్రిపురాంబకూజయమంగళంశుభమంగళం । మాటనివిడచినమునులనుబోధించినదేవికి । జయమంగళంశుభమంగళం॥ ౬ ॥ చక్రశంఖపాశాంకుశధారిణికినారాయణికి । జయమంగళంశుభమంగళం । చక్రరాజబిందుమధ్యవర్తికిదాక్షాయణికి।జయమంగళంశుభమంగళం ॥ ౭ ॥మధుకైటభులద్రుంచినట్టియోగనిద్రాదేవికి।శుభమంగళంజయమంగళం ॥ విధిముఖసకలసురాసురసందోహజననికి । జయమంగళంశుభమంగళం పంచదశిమంత్రపంజరాంతరనివాసినికి।జయమంగళంశుభమంగళం।పంగ్నులవేంకటార్యరూపిణికిశ్రీవాణికి।జయమంగళంశుభమంగళం॥ ౯ ॥ కాంచనాంబరికిసత్కారుణ్యరసపూరితాక్షికి । జయమంగళంశుభమంగళం । చెంచురామకవిసుగుణవర్ధనికికౌమారికి।జయమంగళంశుభమంగళం॥౧౦॥

పరాశక్తివిలాసగీతామృతసాగరము

సంపూర్ణము.